





# కథలు

## నీతి, పురాణ, పొడుపు

## బొమ్మల భట్టి - విక్రమాదిత్యుల కథలు- 1 , 2





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam

Author:

Year: to

Subject: Any Subject

Language: Telugu

Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# ఒక మాట !

బాలలూ!

భారతదేశము మహావీరులకు పుట్టినిల్లు. శ్రీరాముడు, పరశురాముడు, శ్రీకృష్ణుడు, భీష్ముడు, కర్ణుడు, అర్జునుడు, పురుషోత్తముడు మొదలగు అనేక మంది మహావీరులను కన్న వీరమాత మన భారతమాత.

ఆ విధముగా భారతభూమిలో జన్మించిన వీరులలో విక్రమాదిత్యుడు ఒకడు. విక్రమాదిత్యుడు మొదట చంద్రగుప్తుడు అను పేరుతో రాజ్యపాలన చేయుచుండెడివాడని, అతడు అసమాన బలపరాక్రమములు చూపి, అనేకమంది రాజులను, రాజ్యములను జయించి "విక్రమాదిత్యుడు" అను బిరుదు పొందినాడని చరిత్రకారులు వ్రాసిరి.

ఏది ఎట్లున్నను విక్రమాదిత్యుడు అసమాన బలపరాక్రమములు కలవాడని, ధర్మము తప్పక ప్రజలను పాలించిన రారాజని ప్రసిద్ధిపొందినాడు. శక పురుషునిగా గుర్తింపబడుచున్నాడు. ఆయన ధైర్యసాహసములను, వీరత్వమును, న్యాయబుద్ధిని తెలుపు కథలు,గాధలు అనేకము మన దేశములో ప్రచారమందున్నవి ఆ కథలు వినోదము, విజ్ఞానము, ఆశ్చర్యానందములు కలిగించుచు ఆబాల వృద్ధులను అలరింపజేయుచున్నవి. అట్టి కథలలో కొన్ని ముఖ్యమయిన కథలను ఈ పుస్తకములో వ్రాసితిని.

నా ఈ రచనను "నవరత్న బుక్ సెంటర్" (విజయవాడ) వారు స్వీకరించి, ఆ యా కథలకు సంబంధించిన చక్కని చిత్రపటములు అనేకము చేర్చి, అందమయిన ముఖచిత్రముతో ముచ్చటగా ప్రచురించి మీకు అందజేసినందుకు వారికి నా ధన్యవాదములు తెల్పుచున్నాను.

—రేవళ్ళ సూర్యనారాయణమూర్తి.

# మా స్వంత ప్రచురణలు

బొమ్మల శ్రీ షిర్డీసాయి జీవిత చరిత్ర
" అక్బర్ బీర్బల్ వినోద కథలు
" తెనాలి రామకృష్ణుని సంపూర్ణ హాస్య కథలు
" ఆలీబాబా 40 దొంగలు
" అల్లావుద్దీన్ అద్భుతదీపం
" గలివర్ సాహస యాత్రలు
" శ్రీ శ్రీ శ్రీ మర్యాదరామన్న కథలు
" భట్టి విక్రమార్కుని సాహస కథలు (2 భాగాలు)
" భేతాళ కథలు
" మొగల్ సామ్రాజ్య కథానాయకులు
" ప్రవక్త మహమ్మద్
" ఏసుక్రీస్తు కథలు
" మథర్ థెరిసా
" రవీంద్రనాథ్ ఠాకూర్
" యోగివేమన
" భగత్ సింగ్
" అంబేద్కర్
" యశపాల్ కపూర్
" భగవతీచరణ్
" సుభాస్‌చంద్రబోస్
" చంద్రశేఖర ఆజాద్
" జయప్రకాష్ నారాయణ్
" సంఘసంస్కర్త రాజారామమోహనరాయ్
" పూజ్యబాపూజీ

# భట్టి - విక్రమాదిత్యుల
# కథలు
## మొదటి భాగము

పూర్వము నందిపురము అనునొక పట్టణము ఉండెను. ఆ పట్టణమున గల బ్రాహ్మణ అగ్రహారమునందు చంద్రవర్ణుడు అను బ్రాహ్మణుడు నివసించుచుండెను. అతడు సకలశాస్త్రములు శ్రద్ధగా చదివి గొప్ప పాండిత్యము సంపాదించెను. అయినను అతనికి తృప్తికలుగలేదు. తనకు తెలిసిన విద్యలుగాక ఇంకను ఎన్ని విద్యలుగలవో అన్ని విద్యలను అభ్యసించవలెనని తలంచుచుండెను. అట్టి తలంపుతో నతడు పిల్లనిత్తుమని వచ్చి అడిగినను వివాహ మాడుటకు యిష్టపడక బ్రహ్మచర్యము నవలంబించి సర్వకాల సర్వావస్థలలో జ్ఞానార్జనకై ప్రయత్నించుచుండెను.

కొంతకాలము గడచిన తరువాత చంద్రవర్ణుడు నందిపురమును వదలి దేశదేశములు తిరుగుచు నూతనవిద్యలను నేర్పు గురువునకై వెదుకసాగెను. ఎన్ని దేశములు తిరిగినను అతనికి నచ్చిన గురువు దొరకలేదు.

నూతన గురువుకై అన్వేషించుచు అతడొకనాడు అరణ్యమార్గమున పోవుచు మిక్కిలి అలసిపోయెను. అతనికి విపరీతమయిన దాహ బాధ కలిగెను. దాహబాధ తీర్చుకొను తలంపుతో నీటి కొరకు వెదకుచుండగా నొక పెద్ద చెరువును, ఆ చెరువుగట్టుపై నొక గొప్ప రావిచెట్టును కనబడినవి. వానిని చూచి చంద్రవర్ణుడు చాల సంతోషించి, చెరువు వద్దకుపోయి అందున్న నిర్మలోదకము త్రాగి దాహబాధ తీర్చుకొనెను. పిమ్మట శ్రమ తీర్చుకొనుటకై రావిచెట్టు నీడలో పరుండెను.



# చంద్రవర్ణునకు బ్రహ్మరాక్షసి కనబడుట

ఆ రావిచెట్టుపై కొంతకాలమునుండి ఒక బ్రహ్మరాక్షసి నివసించు చుండెను. ఆ రాక్షసి సకల విద్యలు నేర్చిన దిట్ట. ఆ రాక్షసి బ్రహ్మలోకమును కోరి తపస్సు చేయుచుండెను.

అతడు ప్రతి దినము తపము ముగిసిన పిమ్మట చెట్టునుండి క్రిందికి దిగి చెఱువు వద్దకుపోయి అనుష్టానములను తీర్చుకొనుచుండెను. మామూలు ప్రకారము ఆ రాక్షసి చెట్టునుండి క్రిందికి దిగి అచ్చట గాఢనిద్రలో మునిగియున్న చంద్రవర్ణుని చూచి జాలిపడెను. దగ్గరకు వెళ్ళి అతనిని మేల్కొలిపి "ఎవరునీవు? ఇచ్చటికేలవచ్చితివి ? నీ నివాస స్థలమేది ? ఏ మాత్రము దాచక చెప్పుము" అని అడిగెను.

చంద్రవర్ణుడు పైకి లేచి, కండ్లు నులుముకొని తన ఎదుటనున్న బ్రహ్మరాక్షసికి నమస్కరించి "అయ్యా ! నేనుబ్రాహ్మణుడను. చంద్రవర్ణుడను పేరు గలవాడను. నా నివాసస్థలము నందిపురము. నాకు తెలియని విద్యలను తెలిసికొన గోరి సద్గురు కొరకు వెదకుచు యిచ్చటికి వచ్చినాను. ఈ చెరువు నీరు త్రాగి దాహ బాధ తీర్చుకొంటిని. మార్గాయాసము తీర్చుకొనదలచి ఈ చెట్టునీడ నాశ్రయించితిని. మీ ముఖ తేజస్సును చూచి సకల శాస్త్రములు తెలిసినవారని గ్రహించితిని. నాకు తెలియని విద్యలు తెలిపి నన్ను కృతార్థుని చేయ గోరు చున్నాను" అని వినయంగా కోరెను.

చంద్రవర్ణుని మాటలు విని బ్రహ్మరాక్షసుడు "చంద్రవర్ణా! నీ ఆశయము తెలిసికొని చాల సంతోషించితిని. నీవు కోరినట్లు నాకు తెలిసిన విద్య లన్నింటిని నీకు చెప్పెదను. నీ వేమాత్రము అశ్రద్ధ చూపక, నా సమయమును వృథా చేయక తెలిసికొనుము. స్వల్పకాలములోనే నీవు సకల విద్యలు నేర్చుకొన

గలవు" అని పలుకగా, చంద్రవర్ణుడు "గురుదేవా! మీరు చెప్పినట్లు చేయుదును. శ్రద్ధగా నేర్చుకొందును. విద్యార్జనలో ఎన్ని కష్టము లెదురైనను సంతోషముగా భరింతును" అని చెప్పెను.

అప్పుడు ఆ బ్రహ్మరాక్షసుడు "చంద్రవర్ణా! నేను ఈ చెట్టుమీద నుండి నీకు నేర్పదలచిన విషయములను రావియాకులపై వ్రాసి పడవేయుచుందును. నీవు ఆ పత్రములపై వ్రాసిన విషయములను ఆరు మాసములు రాత్రింబగళ్ళు నిద్రాహారములు మాని చదువుకొనుచుండవలెను. ఒక్క దినమైనను ఉల్లంఘించకుండ నేనువ్రాసిన విషయములను శ్రద్ధగా పఠించునప్పుడే నీకు సంపూర్ణ పాండిత్యము లభించగలదు. ఈ నియమం తప్పితివా నా ఆగ్రహమునకు గురి కాగలవు" అని చెప్పెను.

చంద్రవర్ణుడు బ్రహ్మరాక్షసుడు చెప్పినట్లు చేయుదునని ప్రమాణము చేసెను. అప్పుడా రాక్షసుడు చంద్రవర్ణునికొక మంత్రమునుపదేశించి "దీనిననుష్ఠించినచో నీకు ఆకలి, నిద్రలు కలుగవు" అని చెప్పెను. చంద్రవర్ణుడు భక్తి శ్రద్ధలతో ఆ బ్రహ్మరాక్షసుడు చెప్పినట్లు చేయుచు ఆరు మాసములలో సకల విద్యలు చక్కగా నేర్చెను. బ్రహ్మరాక్షసుడు చెప్పిన మంత్రమును పఠించుచు ఆరు మాసములు ఆకలి, నిద్రల బాధ పొందకుండెను.

ఇంతలో ఆ బ్రహ్మరాక్షసుని తపస్సు పూర్తియైనది. అతనికి కలిగిన శాపము తీరినది. అంతనాతడు దివ్యమయిన తేజస్సుతో ప్రకాశించసాగెను. చంద్రవర్ణుడతని దివ్యరూపమును చూచి ఆశ్చర్యపడసాగెను. అతనిని చూచి దివ్యరూపుడైన బ్రహ్మరాక్షసుడు "చంద్రవర్ణా! నేనొక శాపవశమున యిచ్చట బ్రహ్మరాక్షసుడనై పుట్టితిని. బ్రహ్మను గూర్చి తపస్సుచేసి శాపవిముక్తుడనైతిని. కొద్దిసేపటిలో నేను బ్రహ్మలోకమునకు పోవుదును" అని చెప్పుచుండగా, బ్రహ్మ

రథము వచ్చి అతని ముందు ఆగెను. అతడు ఆ రథము నెక్కి "చంద్రవర్ణా నీవు సకల విద్యా శారదుడవైతివి. నీవు నేర్చుకొనవలసిన విద్యలిక ఏవియులేవు. కావున నీవు తక్షణము నీ దేశమునకువెళ్ళిపొమ్ము. రూపలావణ్యములు గల కన్యను వివాహమాడి, పుత్ర పౌత్రాభివృద్ధి కలిగి సుఖముగా బ్రతుకుము" అని ఆశీర్వదించి, అంతరిక్షమునకు పోయెను.

## చంద్రవర్ణుని చేరదీసి రక్షించిన వేశ్య

పిమ్మట చంద్రవర్ణుడు కొండలు, కోనలు దాటి తన స్వస్థలము చేరదలచి వచ్చుచుండెను. బ్రహ్మరాక్షసుడు పెట్టిన ఆరు మాసముల గడువు పూర్తియగుటవలన అతడు ఆకలికి, నిద్రకు బాధపడుచుండెను. ఎంతో శ్రమ పడి నడచి నడచి అతడు ప్రతిష్ఠాపురము అను నగరమును సమీపించెను. ఊరిలోనికి పోయి ఎవరినైన బ్రాహ్మణుని ఆశ్రయించి కడుపునిండా భుజించి, హాయిగా నిద్రించి ముందుకు సాగిపోవలెనని తలచెను. ఎంత ప్రయత్నించినను అతడు ముందుకు నడువలేక పోవుచుండెను. తుదకు ఒక అందమైన గృహమును చూచి అది బ్రాహ్మణులదే అయివుండునని భావించి అతికష్టముపై నడచి పోయి ఆ యింటి యరుగుపైకిచేరి, తన వెంట తెచ్చిన రావియాకుల మూటను తల క్రింద పెట్టుకొని పండుకొనెను.

ఆ సమయమున ఆ యింటిలో నెవరునులేరు. చంద్రవర్ణుడు భావించినట్లు ఆయిల్లు బ్రాహ్మణులదికాదు. అది భాగ్యవంతురాలైన ఒక వేశ్యది. ఆమె పేరు అలంకారవల్లి. ఆమె సంగీత, నృత్యశాస్త్రములు బాగుగా నేర్చిన దేవదాసి. ఆమె ఆనాటి రాత్రి పది గంటలవరకు దేవునిసేవలోగడిపి యింటికి వచ్చెను.

అట్లు యింటికి వచ్చిన అలంకారవల్లి తన యింటి అరుగుపై గుర్రు

పెట్టి నిద్రపోవుచున్న చంద్రవర్ణుని చూచినది. దగ్గరకు వెళ్ళి పిలిచినది. ఎంత పిలిచినను అతడు మేల్కొనలేదు. అంతట నామె యింటిలోనికిపోయి దీపము తీసుకొని వచ్చి పరుండియున్న వ్యక్తిని చూచినది. అతని బట్టలు చినిగి, ధూళితో నిండి బిచ్చగాని బట్టల వలెనున్నవి. తల వెంట్రుకలు ధూళితో నిండి యిటునటు చెదరి యున్నవి. గడ్డము బాగుగా పెరిగియున్నది. ఇట్లున్నను అతని ముఖములో మంచి కళ వున్నది. ఇతడు ఎవడో గొప్పవ్యక్తియే అయివుండును. ఈ



అలంకారవల్లి చంద్రవర్ణునకు చికిత్స చేయించుట

విధముగ ఉండుటకు కారణమేమో అని ఆలోచించసాగినది. ఆ రాత్రి అంతయు అతనిని కదుపకూడదని నిశ్చయించుకొని లోనికి పోయి నిద్రించినది.

ఆమె తెల్లవారు ఝామునలేచి, కాలకృత్యములు తీర్చుకొని, వీధి లోనికి వచ్చి అరుగుపై నిద్రించుచున్న వ్యక్తిని చూచినది. ఇంత మత్తునిద్రా అనుకొన్నది. మరికొంతసేపైన తరువాత అతని సమీపమునకు పోయి పిలచినది. ఎంత పిలిచినను అతడు ఉలుకలేదు, పలుకలేదు. లోనికి పోయి నీళ్ళుతెచ్చి ముఖముపై చిలుకరించినది. అప్పుడతడు కండ్లు తెరచి, ఏదో చెప్పబోయినాడు. కాని మాట రాలేదు, అతని స్థితి చూచి ఆమె అతడు మరణావస్థలో నున్నట్లు తలచినది. వెంటనే ఒక ఘన వైద్యుని పిలిపించి, అతనిని కాపాడమని చెప్పినది.

వైద్యుడు చాలాసేపు చంద్రవర్ణుని పరీక్షించి అతడు చాలా కాలము నుండి నిద్రాహారములేక యిట్టి ప్రమాదస్థితికి లోనైనాడని, బ్రతుకుట కష్టమని, బ్రతికించుటకు గట్టిగా ప్రయత్నింతునని చెప్పినాడు. వైద్యుని మాటలు విని అలంకారవల్లిచాలా భయపడినది. ఎన్ని ఖర్చులైనను నేను భరింతును. ఆయన నెట్లయినను బ్రతికింపుడు. మీకు కోరినంత ధనమిచ్చెదనని వైద్యునితో చెప్పినది.

ఆ వైద్యుడు ఎంతో కష్టపడి, మంచి మంచి మందులు తయారుచేసి చంద్రవర్ణునకు యిచ్చి, పాలు-పండ్లరసములు యిప్పించి చికిత్స చేయసాగినాడు. ఇట్లువారము దినములు జరిగిన తరువాత చంద్రవర్ణుడు నిద్రనుండి మేల్కొని నెమ్మదిగ పైకి లేచి కూర్చుండి నలువైపుల తేరిపారచూచి, అది దేవదాసి గృహ మని గ్రహించి, యెవరికిని చెప్పకుండ వెళ్ళిపోసాగినాడు.

అప్పుడచ్చటికి అలంకారవల్లి వచ్చి అతడు పైకి లేచినందుకు ఆనం దించి, వెళ్ళిపోవుచున్నందుకు బాధపడి, అతనిని ఆపి, "బ్రాహ్మణోత్తమా!

ప్రాణాపాయస్థితిలో నున్న మీకు మందులు యిప్పించుచు, తగుసేవలు చేస్తూ, అత్యుత్తమమైన ఆహారము, మొదలగునవి యిచ్చుచు మిమ్ము కాపాడిన నాకు చెప్పనైన చెప్పకుండ వెళ్ళిపోవుట న్యాయమా! నన్ను విడిచిపోవద్దు. నన్ను వివాహమాడి సంతోషపెట్టుడు. మిమ్ము విడిచి నేను జీవించలేను" అని అనేక విధముల బ్రతిమాలసాగెను.

చంద్రవర్ణుడు ఆమె ఎంత బ్రతిమాలినను వేశ్యాకులమున పుట్టిన అలంకారవల్లిని వివాహమాడుటకు ఇష్టపడలేదు. "నా ప్రాణములు రక్షించిన నీవు నాకు తల్లివంటిదానవు. కావున నిన్ను వివాహమాడజాలను" అని చెప్పెను.

అలంకారవల్లి చంద్రవర్ణుని అందచందములకు ముగ్ధురాలై గాఢముగ మోహించెను. ఆ మోహమును అణచుకొనలేక అతని నెట్లయిన పెండ్లి ఆడ వలెనని నిశ్చయించుకొని అతనిని వెళ్ళిపోనీయక అడ్డుపడి తగవుపెట్టెను. వీధిలో తగవుపడుచున్న వారిద్దరిని రాజభటులు తీసుకొనివెళ్ళి రాజు ముందు నిలిపిరి.

రాజు చంద్రవర్ణుని చూచి "అలంకారవల్లి అను నీ దేవదాసి యింటి ముందు నిలబడి ఆమెతో తగవుపడుటకు కారణమేమి?" అని అడుగగా, చంద్ర వర్ణుడు "రాజా! నేను బ్రాహ్మణకులమున పుట్టినవాడను. సకలశాస్త్రములు చదివినవాడను. దేశాంతరమేగి నా స్వస్థలమునకు పోవుచు ఈ నగరము చేరు సరికి నిద్రాహారములు లేక అలసిపోయి ఈమె యింటి అరుగుపై నిద్రించితిని. ఆమె పిలచినను నేను లేవక పడియుండుటవలన ఆమె జాలిపడి వైద్యుని పిలి పించి చికిత్స చేయించి నా ప్రాణము రక్షించినమాట యదార్థము. నా ప్రాణమును కాపాడిన ఆమెను నేను తల్లిగా భావించుచున్నాను కాని ఆమెనన్ను వివాహమాడ గోరుచున్నది. నేనందుకు యిష్టపడక నా దారిని నేను పోవుచుండగా అడ్డుకొని అల్లరిచేయుచున్నది. సద్బ్రాహ్మణ కులమున పుట్టిన నేను ఎంత సద్గుణవంతు

రాలైనను వేశ్యకులమున పుట్టిన కన్యను వివాహమాడిన లోకము హర్షించునా? అట్లు చేయుటవలన వర్ణాశ్రమ ధర్మములు చెడవా ?" అని అడిగెను.

తరువాత రాజు అలంకారవల్లిని చూచి "నీవు చెప్పుకొనదలచినదేమైన కలదా" అని అడుగగా, ఆమె "ప్రభూ! ఈ చంద్రవర్ణుడు చెప్పిన విషయము లన్నియు యదార్థమైనవే. నేను వేశ్యకులమున పుట్టిన దాననైనను నా గుణ గణములు ఈ నగరవాసులెల్లరు యెరుగుదురు. ఇతనిని చూచినక్షణమునుండి నా కీతనిపై అధికమైన మోహము కలిగినది, ఇతనిని వివాహమాడకున్న నేను జీవించలేను. ఇతడు నన్ను వివాహమాడునట్లుచేసి నా ప్రాణము కాపాడుడు" అని విన్నవించుకొనెను.

ఆమె మాటలు విని రాజు తన మంత్రులను, సభలోనున్నవారిని చూచి "వీరి తగవు తీర్చుటకు తగు మార్గము ఆలోచించి చెప్పుడు" అని కోరగా, మంత్రులు ఆలోచించి యిట్లు చెప్పిరి— "మహాప్రభూ ! బ్రాహ్మణకులమున పుట్టిన పురుషుడు తన కులమున పుట్టినస్త్రీని గాక ఇతర కులమున పుట్టిన ఒక స్త్రీని వివాహమాడకూడదు. అట్లు వివాహమాడవలసివచ్చినచో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర కన్యలను ఒకే ముహూర్తమున వివాహమాడవచ్చును. ఇది హిందూ ధర్మశాస్త్రము ననుసరించి చెప్పిన అభిప్రాయము. అటుపైన తమ యిష్ట మెట్లున్నదో అట్లు చేయుడు" అని చెప్పిరి.

మహారాజు అంతకు ముందే చంద్రవర్ణుని అందచందములు చూచి ముగ్ధుడై తన కుమార్తెకు తగిన వరుడు కాగలడు. అతని నెట్లయినను ఒప్పించి తన కుమార్తె నిచ్చి వివాహము చేయవలెనని ఆలోచించుచుండగా మంత్రులు పై విధముగా తమ అభిప్రాయము చెప్పిరి.

అంతట రాజు మంత్రులను, సభికులను చూచి "చంద్రవర్ణుడు అంద

చందములలో చంద్రునివంటివాడు. సకలశాస్త్రములు చదివినవాడు. అతనికి నా కుమార్తె నిచ్చుటకు నిశ్చయించుకొంటిని. నాతోపాటు మా పురోహితుడు, వైశ్య కులోత్తముడగు సోమశేఖరుడు కూడ తన కుమార్తెలను చంద్రవర్ణునకు యిచ్చి పెండ్లి చేయుటకు సమ్మతించగలరని నమ్ముచున్నాను. ఇక శూద్ర కులమున జన్మించిన అలంకారవల్లి ముందే అతనిని వివాహమాడుటకు సిద్ధముగా వున్నది. ఈ విధముగ చేసిన చంద్రవర్ణునకు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రకులములకు చెందిన కన్యలను ఒకే ముహూర్తమున చేసిన వారము కాగలము" అని పలుకగా, పురోహితుడును, సోమశేఖరుడును తమ పుత్రికలను చంద్రవర్ణునకు యిచ్చుటకు అంగీకరించిరి. రాజు మాట కాదనలేక చంద్రవర్ణుడు నాలుగుకులములకు చెందిన కన్యలను పెండ్లాడుటకు అంగీకరించెను. అలంకారవల్లి ఎంతో పొంగి పోయెను.

ఒక శుభముహూర్తమున మహారాజు చంద్రవర్ణునకు తన పుత్రికను, పురోహితుని పుత్రికను, సోమశేఖరుని కుమార్తెను, అలంకారవల్లిని యిచ్చి ఎంతోవైభవముగా వివాహము జరిపించెను. చంద్రవర్ణుడు తలచని తలంపుగా జరిగిన తన వివాహమును తలచుకొని, దైవానుగ్రహము వలన తన కట్టి అదృష్టముకలిగినదని గ్రహించి ఎంతో ఆనందముగా కాలము గడుపుచుండెను.

## భట్టి-విక్రమాదిత్యుల పుట్టుక

ఇట్లు జరుగుచుండగా, చంద్రవర్ణునకు బ్రాహ్మణభార్యవలన పల్లవుడు, రాజు పుత్రికవలన విక్రమాదిత్యుడు, వైశ్యకాంతవలన భట్టి, వేశ్యకాంతవలన భర్తృహరి అను నలుగురు పుత్రులు కలిగిరి. వారు నలుగురు శుక్లపక్ష చంద్రుని వలె దినదినాభి వృద్ధి పొందుచు సకల విద్యలనభ్యసించిరి.



ఇట్లు జరుగుచున్న సమయమున ప్రతిష్ఠాపుర మహారాజు తీవ్రవ్యాధికి లోనైనాడు. తనకు మరణ మాసన్నమైనదని గ్రహించి, తనకు పుత్రులు లేనందున అల్లుడగు చంద్రవర్ణుని తన రాజ్యమునకు రాజు గావించినాడు. చంద్రవర్ణుడు తమకు రాజైనందుకు మంత్రులు, సైనికులు, ప్రజలు ఎంతో ఆనందించినారు.

చంద్రవర్ణుడు ధర్మము తప్పక రాజ్యపాలన చేయుచు ప్రజలందరి మెప్పు పొందగలిగినాడు. దేశవిదేశములలో మంచిపేరు సంపాదించినాడు. తనకు

తెలిసిన విద్యలనన్నింటిని తన కుమారులకు బాగుగా నేర్పినాడు. కొన్నాళ్ళ కతనికి అంత్యసమయము దగ్గరైనది. అప్పుడతడు తన నలుగురు పుత్రులను పిలిచి వారి కనేక బుద్ధులు చెప్పినాడు. అందరిని ఐకమత్యముగా ఉండమని కోరినాడు. పిమ్మట వారిని దగ్గరకు పిలిచి "కుమారులారా! నా మాటలు శ్రద్ధగా వినుడు. మీ తల్లులను వివాహమాడుటకు ముఖ్యకారణము భర్తృహరి తల్లియగు అలంకారవల్లియే. కావుననాకు ఆమెయే పెద్ద భార్యయు, పట్టపురాణియు నగును. ఆమె గర్భమున పుట్టినవాడే నా సింహాసన మధిష్టించి రాజ్యపాలన చేయుటకు అర్హుడగును. కావున భర్తృహరికి ఈ రాజ్యమును పట్టము గట్టెదను. మీరు ముగ్గురు యువరాజులుగ ఉండి, అన్ని విషయములలో అతనికి తోడ్పడుచు రాజ్యమును చక్కగా పాలించుడు" అని చెప్పగా, "తండ్రీ! మీ ఆజ్ఞను సార మట్లే చేసెదము" అని వాగ్దానము చేసిరి.

అంతడు చంద్రవర్ణుడు పురోహితులను పిలిపించి, శుభముహూర్తము పెట్టించి, ఆ ముహూర్తమున భర్తృహరికి పట్టము గట్టెను. ధర్మము తప్పక రాజ్యపాలన చేయుమని ఆశీర్వదించి ప్రాణము వదలెను.

తండ్రి మరణించిన తరువాత భర్తృహరి తన ముగ్గురు సోదరుల సహాయమున రాజ్యమును చక్కగా పాలించసాగెను. కొన్ని దినములు గడచిన తరువాత చంద్రవర్ణునకు బ్రాహ్మణకాంత వలన పుట్టిన పల్లవుడు మోక్షాపేక్ష గలవాడై సంసార సుఖములను త్యజించి, దండకమండలములు, కాషాయ వస్త్రములు ధరించి తపస్సు చేసికొనుటకు అరణ్యమున కేగెను.

తరువాత కొంతకాలమునకు భర్తృహరి భార్య దుష్ప్రవర్తనకు అసహ్యపడి రాజ్యమునకు విక్రమాదిత్యుని రాజుగను, భట్టిని ప్రధానమంత్రిగను ఏర్పరచి, సర్వసంగ పరిత్యాగియై అడవులకు పోయి తపమాచరించసాగెను.

# విక్రమాదిత్యుడు రాజగుట

భర్తృహరి రాజ్యత్యాగము చేసిన పిమ్మట విక్రమాదిత్యుడు భట్టి సలహా, సహాయముల ననుసరించి చక్కగా రాజ్యపాలన చేయసాగెను. క్రమముగా వారికి తమ రాజ్యము పెంపొందించవలెనను తలంపు కలిగినది. అట్టి తలంపుతో విక్రమాదిత్యుడు తన చతురంగ బలములను ఎంతో అభివృద్ధి చేసెను.

ఒక శుభముహూర్తమున విక్రమాదిత్యుడు భట్టితో కలసి చతురంగ బలములను వెంటబెట్టుకొని తన పొరుగు దేశములపై దండయాత్ర సాగించి, అచ్చటి వీరులందరిని జయించెను. ఆ విధముగా విక్రమాదిత్యుడు ఛప్పన్న దేశములను జయించి, వారుతమకు కప్పములు చెల్లించుచుండునట్లు ఏర్పాటు చేసుకొని స్వదేశమునకు తిరిగివచ్చెను. ఆనాటి వీరులకు విక్రమాదిత్యుడు సింహస్వప్నమై భయము గొల్పసాగెను. భట్టి యొక్క యుద్ధతంత్రమునకు తోడు విక్రమాదిత్యుని శౌర్యపరాక్రమముల వలన వారి రాజ్యము ఆసేతుహిమాచల పర్యంతము వ్యాపించినది. విక్రమాదిత్యుడు రాజాధిరాజై ప్రకాశించసాగెను.

తరువాత భట్టీ విక్రమాదిత్యులు తమ రాజ్యమునకు రాజధానిగా మరియొక పట్టణమును నిర్మించవలెనని నిశ్చయించుకొనిరి. వింధ్య పర్వతములకు, గుణవతీనదికి సమీపమున నొక గొప్ప నగరమును నిర్మించిరి. అది దేవేంద్రుని నివాసస్థలమగు అమరావతివలె శోభించుచుండెను. దానిని నిర్మించుటకు పూర్వమచట గొప్ప కాళికాలయము ఉండెను. అది ఉజ్జయినీ మహాకాళీ ఆలయమని ప్రసిద్ధి పొందియుండెను. అందువలన వారు తమ రాజధానికి ఉజ్జయిని అను పేరునే ఉంచి, అందుండి రాజ్యపాలన చేయసాగిరి.

భట్టి విక్రమాదిత్యులిద్దరూ ఉజ్జయిని మహాకాళిని భక్తి శ్రద్ధలతో



భట్టి-విక్రమాదిత్యులు మహాకాళిని పూజించుట

సేవించుచుండిరి. దేవికి మూడు వేళలలో శాస్త్రీయముగా పూజలు చేయించు చుండిరి. ఘనముగ దీపధూప నైవేద్యములు అర్పించుచుండిరి. వారి పూజలకు మెచ్చి దేవి నవనిధులను ప్రసాదించెను. అన్నివేళల వారిని కాపాడు చుండెను. కాళికాదేవి అనుగ్రహమువలన విక్రమాదిత్యుడు తన సోదరుడును, ప్రధాన మంత్రియునగు భట్టి సహాయమున రాజ్యమును ఎంతో వైభవముగా పాలించు చుండెను.

## రంభా-ఊర్వశులు తగవుపడుట

ఇట్లు జరుగుచుండగా దేవలోకమున ఇంద్రునిసభలో నృత్యముచేయు రంభ, ఊర్వశియను అప్సరసలు ఒకరికంటె ఒకరు గొప్పవారమని కీచులాడు కొనసాగిరి. తుదకు దేవేంద్రుని వద్దకుపోయి మా యిరువురిలో నృత్యము చేయుట యందు ఎవరు గొప్పవారో చెప్పవలెనని అడిగిరి. దేవేంద్రుడు ఏమి చెప్పవలెనో తోచక మునీశ్వరులతోను, దేవతలతోను సభ ఏర్పాటుచేసి, ఆ సభలో రంభను, ఊర్వశిని నాట్యముచేయ నాజ్ఞాపించి, సభలో నున్నవారి నుద్దేశించి వారిద్దరిలో నెవరు బాగుగా నాట్యము చేయగలరో నిర్ణయించి చెప్పమని కోరెను.

రంభా, ఊర్వశులిద్దరూ ఒకరిని మించినట్లు మరియొకరు వారినృత్యము చేసిరి.నృత్యముచూచిన దేవతలు, ఋషులు వారిద్దరిలో ఎవరు అధికులో, ఎవరు అధములో నిశ్చయించలేక "ఇరువురును బాగుగానే నృత్యము చేసిరి. మీలో ఒకరు గొప్పవారు, మరియొకరు తక్కువ వారని నిర్ణయించిచెప్పుటకు వీలుకాదు. కావున భేదబుద్ధి లేక అన్యోన్యముగా ఉండుము" అని చెప్పిరి, ఎవరు ఎంత నచ్చజెప్పినను రంభా, ఊర్వశులు పట్టిన పట్టు విడువలేదు. మా యిద్దరిలో ఎవరుగొప్పవారో తేలసంతవరకు మేము నాట్యము చేయమని చెప్పిరి.

## విక్రమాదిత్యుడు దేవలోకమునకు వెళ్లుట

దేవేంద్రునకుగాని, సభలోనున్నవారికిగాని వారి పట్టుదల పోగొట్టు మార్గము తోచలేదు. ఇంతలో అచ్చటికి నారద మహర్షి వచ్చెను. ఆలోచనలో మునిగియున్న దేవేంద్రుని, సభలోని వారిని "ఏ విషయమును గూర్చి మీరింత

తీవ్రముగ ఆలోచించుచున్నారని" అడిగెను. దేవేంద్రుడు అసలు విషయమంతయు నారద మహర్షికి తెలిపెను.

అది విని నారదుడు "దేవేంద్రా! భూలోకమున ఉజ్జయినీ నగరము కలదు. దానిని మహాపరాక్రమవంతుడు, దానశీలుడు, మేధావి, సకల విద్యలలో సంపూర్ణపాండిత్యము గలవాడునగు విక్రమాదిత్యుడు పాలించుచున్నాడు. అతనిని పిలిపించి అడుగుము. వీరిద్దరిలో ఎవరుగొప్పవారో తేల్చి చెప్పగలడు" అని చెప్పెను.

దేవేంద్రుడు నారదమహర్షి సలహానుసరించి ఉజ్జయినీ నగరమునకు రథమును పంపి క్షణములో విక్రమాదిత్యుని సభకు రప్పించెను. దేవేంద్రుడు విక్ర మాదిత్యుని ఉచితరీతిన గౌరవించి, సభలోనున్నవారి నందరిని పరిచయము చేసి, ఉచితాసనమున కూర్చుండబెట్టి ఆయనను రప్పించుటకు కారణమేమో వివరముగా చెప్పెను. "విక్రమాదిత్యా! ఇప్పుడు నీయెదుట రంభ, ఊర్వశి నృత్యము చేయు దురు. అదిచూచి నృత్యము చేయుటలో వారిలోనెవరు శ్రేష్ఠులో నిశ్చయించి చెప్పుము" అని అడిగెను.

దేవేంద్రుని మాటలు విని విక్రమాదిత్యుడు ఆశ్చర్యానందములుపొంది తనకు కొంతవ్యవధి యిమ్మని కోరెను. దేవేంద్రుడు అందుకు అంగీకరించగా, విక్రమాదిత్యుడు సభనుండి ఒక ఉద్యానవనమునకు పోయి, కొన్నిపూవులను కోసి రెండు పూలచెండ్లను కుట్టెను. ఆ చెండ్లలో కొన్ని విషకీటకములను ఉంచెను. ఆ చెండ్లను ఒక వస్త్రమునచుట్టి సభలోనికి వచ్చికూర్చుండెను. రంభా ఊర్వశీ "యిక నాట్యము చేయమందురా" అని అడిగిరి.

అంతట విక్రమాదిత్యుడు తన వెంట తెచ్చిన పూలచెండ్లలో నొకటి రంభకు, మరియొకటి ఊర్వశికి యిచ్చి "మీరు ఈపూలబంతులను చేబట్టినృత్యము

చేయుడు. మేము భూలోకమున యిట్లే పరీక్షింతుము" అని చెప్పెను. వారు అందుకు అంగీకరించి పూలచెండ్లను పట్టి నృత్యము చేయనారంభించిరి. రంభ తన చేతియందున్న పూలచెండును గట్టిగా అదిమిపట్టుకొనుటచే దానియందున్న విష కీటకములు చెదరి ఆమెనుకుట్టి బాధించసాగినవి. అందువలననామె నాట్యముచేయు టలో కొంత తడబడసాగినది. ఊర్వశి తనచేతియందున్న పూలచెండును మృదువుగా పట్టుకొని ఏ విధమైన బాధపొందక హాయిగ్గా నాట్యము చేసెను.



దేవసభలో విక్రమాదిత్యుని ముందు రంభా, ఊర్వశి నృత్యము చేయుట

కొంతసేపు అట్లు వారి నాట్యప్రదర్శనము జరిగిన తరువాత దేవేంద్రుడు విక్రమాదిత్యుని చూచి "వీరిద్దరిలో ఎవరు బాగుగా నాట్యముచేసిరి?"అనిఅడుగగా, "ఊర్వశి బాగుగా నాట్యము చేసినది" అని చెప్పెను.

అది విని దేవేంద్రుడు "ఆ విషయమును మీరు ఎట్లునిశ్చయించితిరి?" అని ప్రశ్నించగా, విక్రమాదిత్యుడు రంభను, ఊర్వశిని చూచి "మీకు నేనిచ్చిన పూలచెండ్లను నాకు యిండు" అని అడిగెను. రంభ నాట్యముచేయునప్పుడు దానిని క్రిందపడవేసెను. అందువలన తలవంచి నిలబడెను. ఊర్వశి తన చేతిలోనున్న చెండును విక్రమాదిత్యుని యెదుట పెట్టెను.

అప్పుడు విక్రమాదిత్యుడు దేవేంద్రుని చూచి "సురేంద్రా! వీరిరువురిలో గలభేదములు గమనించితిరిగదా! రంభ నేనిచ్చిన పూలచెండును క్రింద పడవేసెను. ఊర్వశి నేనుయిచ్చిన చెండును భద్రముగ పట్టుకొని నాట్యము చేసెను." అని చెప్పి, ఊర్వశి యిచ్చిన చెండును దేవేంద్రుని ముందువిప్పి అందున్న విషకీటకములను చూపించి "ఊర్వశి ఈ చెండును మృదువుగ పట్టుకొని ఉన్నందున ఇందున్న విషకీటకములు ఆమెను ఏమియు బాధించనందువల్ల ఆమె చక్కగా నాట్యము చేసినది. రంభ తన చేతియందుగలచెండును గట్టిగా అదిమిపట్టుకొనుటచే అందలి విషకీటకములు బాధకలిగి ఆమెనుకుట్టి బాధించసాగినవి. ఆ బాధవలన రంభ నాట్యము చేసినప్పుడు తికమకపడి తప్పటడుగులు వేసినది. విషకీటకముల బాధ భరించలేకనే ఆమె చెండును క్రిందపడవేసినది. కావున ఊర్వశియే గెలుపొందినదని నా నిశ్చయము" అని చెప్పెను.

విక్రమాదిత్యుని మాటలువిని దేవేంద్రాదులు అతని నిర్ణయము సరియైనదే అని అంగీకరించి, ఊర్వశికి తగు బహుమతులిచ్చి గౌరవించిరి. వారు

యిద్దరిని పరీక్షించి తగు తీర్పునిచ్చిన విక్రమాదిత్యుని బుద్ధి బలసంపదను వేనోళ్ళ కొనియాడిరి.

దేవేంద్రుడు విక్రమాదిత్యుని బుద్ధిబలచాతుర్యములకు ఆనందించి, నవరత్నఖచిత స్వర్ణమయమగు సింహాసనమునొకటి బహూకరించి, "నీవీ సింహాసనముపై కూర్చుండి వేయిసంవత్సరములు రాజ్యపాలనచేయగల"వని వరమిచ్చి, ఆశీర్వదించి రథమున కూర్చుండబెట్టి ఉజ్జయినీ పట్టణమునకు పంపెను.

విక్రమాదిత్యుడు రథమును ఉజ్జయినీ మహాకాళి మందిరము వద్ద ఆపించి, దిగి, దేవేంద్రుడొసగిన సింహాసనమును అచ్చట పెట్టించి, గుడిలోనికి పోయి కాళికాదేవిని దర్శించి, సాష్టాంగ నమస్కారము చేసి తన కోటకు వెళ్ళెను.

విక్రమాదిత్యుని రాకవిని, భట్టి ఎంతో ఆనందించి తత్క్షణమే సోదరుని వద్దకుపోయి నమస్కరించి నిలబడెను. విక్రమాదిత్యుడు భట్టినిచేరబిలిచి, ప్రక్కను కూర్చుండబెట్టుకొని దేవలోకమున జరిగిన విశేషములు నన్నిటిని తెలిపెను. తరువాత విక్రమాదిత్యుడు భట్టితో "సోదరా! నాయందు దయవుంచి దేవేంద్రుడు యిచ్చిన సింహాసనము మన యిష్టదైవతమగు మహాకాళి మందిరము వద్దనున్నది. 'దానినధిష్ఠించి వెయ్యిసంవత్సరములు రాజ్యపాలన చేయుము' అని దేవేంద్రుడు వరమిచ్చి, నన్నాశీర్వదించెను. ఒకశుభముహూర్తమున దానిని మన కొలువుకూటమునకు తెప్పించి దానిపై నన్నధిష్ఠింపజేయుము" అని చెప్పెను.

విక్రమాదిత్యుని మాటలు విని భట్టి ఎంతో ఆనందించెను. కానిఅతనిలో నొక విచారముకలిగి యిట్లు అడిగెను- "రాజశేఖరా! మీరు మాత్రము వేయి సంవత్సరములుండునట్లు వరముపొంది వచ్చితిరి. కాని మీకు తోడునీడగనున్న నాకేమి తెచ్చితిరి? నా విషయమే మరచిపోయితిరా?" అని యడిగెను.

భట్టి మాటలు విని విక్రమాదిత్యుడు బాధపడి "తమ్ముడా! ఆ సమయమున నేను నిన్నేగాక, భూలోకమునే మరచిపోయితిని. ఇప్పుడు చింతపడిలాభము లేదు. నా పొరపాటుకు క్షమించుము. అన్యదా భావించక నాతోపాటు నీవు కూడ వేయిసంవత్సరములు బ్రతికియుండుటకేదైన ఉపాయమాలోచింపుము" అని చెప్పెను.

రాజు మాటలు విని భట్టి తనలో, "జరిగిన దానికిపుడు చింతించి ప్రయోజనములేదు. జరుగవలసిన దానిని గూర్చి ఆలోచించుట మంచిది" అనుకొని, రాజువద్ద శలవు తీసికొని తన భవనమునకు పోయి, భోజనమైనను చేయక మంచముపై పరుండి దీర్ఘముగ ఆలోచించసాగెను. అతడు ఆ విధముగ ఆలోచించి తన ఇష్టదేవతయగు కాళి అనుగ్రహము పొంది తన కోరిక తీర్చుకొనవలెనని నిశ్చయించుకొనెను.

## మహాకాళి భట్టికి వరములిచ్చుట

అట్లు నిశ్చయించుకొని భట్టి మరునాడు అర్ధరాత్రి సమయమున పూజా ద్రవ్యములను తీసుకొని కాళీ మందిరమునకు పోయెను. ఆ సమయమున మహాకాళి నగర సంచారమునకు వెళ్ళెను. ఆలయములో దేవి లేకుండుటను చూచి, గుడిలో నొక శుభ్రమైన స్థలమున పద్మాసనమువేసి కూర్చుండి భక్తి శ్రద్ధలతో దేవీ మంత్రమును పఠించసాగెను.

ఇట్లు చేయుచుండగా మహాకాళి నగర సంచారము పూర్తిచేసి తిరిగి ఆలయమునకు వచ్చెను. ఆమె తనను స్తుతించుచు, మంత్రములు చదువుచు పూజచేయుచున్న భట్టిని చూచి దగ్గరకువెళ్ళి "కుమారా! ఈ యర్ధరాత్రి సమయమున ఒంటరిగా వచ్చి నన్ను పూజించుటకు కారణమేమి? ఏమి కోరి నీ విట్లు

చేయుచున్నావు? నీవు నా భక్తుడవు కావున నీ కోరిక తీర్చుట, కష్టములు తొల గించుట నా విధి! నీ కేమి కావలెనో కోరుకొనుము. యిచ్చెదను" అని పలికెను.

జగజ్జనని మాటలు విని భట్టి ఎంతో సంతోషించి, విక్రమాదిత్యుడు దేవలోకమునకు వెళ్ళినది మొదలు అంతవరకు జరిగిన సంగతులన్నియు పూస గ్రుచ్చినట్లు చెప్పి "లోకమాతా! నా సోదరుడు వేయిసంవత్సరములు రాజ్య పాలన చేయునట్లు దేవేంద్రుని వలన వరము పొంది వచ్చినాడు. నా విషయము మరచి పోయినాడు. ఆయనను విడిచి నేను, నన్ను విడిచి ఆయన బ్రతుక జాలము. ఆయనతోపాటు కొంతకాలము రాజ్యపాలన చేయవలెనను కోరిక నాకు గాఢముగా కలదు. కావున నేను రెండువేల సంవత్సరములు జీవించునట్లు వరము అనుగ్రహింపుము" అని ప్రార్థించెను.

అతని ప్రార్థన విని కాళికాదేవి "నీవు విక్రమాదిత్యుని తల నరికి తెచ్చి బలిపీఠమున నుంచిన నీవు కోరిన వరమిచ్చెద"నని చెప్పెను. దేవి మాటలు విని భట్టి కొంతసేపు ఆలోచించి, పరుగు పరుగున పోయి గాఢనిద్రలో మునిగి యున్న విక్రమాదిత్యునిలేపి, జరిగిన విషయము చెప్పగా "తమ్ముడూ! నీవు వెంటనే దేవి కోరినట్లు చేయుము" అని పలికి శిరము వంచెను. భట్టి దేవిపై భారమువేసి ఖడ్గముతో విక్రమాదిత్యుని శిరస్సును ఖండించి మహాకాళి గుడికి పోయి దానిని బలిపీఠమున నుంచెను.

దానిని చూచి దేవి ఆనందించి "నీవు కోరిన వరము యిచ్చితిని సుఖంగా రెండువేల సంవత్సరములు జీవించి రాజ్యపాలన చేస్తూ ఖ్యాతిపొందుము" అని చెప్పగా, భట్టినవ్వి "తల్లీ! దేవేంద్రుడంతనివాని నుండి వేయిసంవత్సరములు రాజ్యపాలన చేయమని వరము పొందిన నా అన్నగతి యిట్లయినది. ఇక నా సంగతి ఏమగునో?" అని అడుగగా, దేవి సంతోషించి "వత్సా! నీకు గ

తెలివి తేటలకు, చాతుర్యమునకు, నా యందు గల భక్తికి ఎంతో ఆనందించి వర మిచ్చితిని. నేనిచ్చిన వరమెన్నటికిని వృధాకాదు. నీ మరియొక వరమేదైన అడుగుము, యిచ్చెద"ననగా, భట్టి పరమానందభరితుడై "తల్లీ! విక్రమాదిత్యుడు లేకుండా నేను జీవించలేను. కావున అతనిని బ్రతికింపుము" అని కోరెను.

మహాకాళి భట్టికి గల సోదరప్రేమకు ఆనందించి వెంటనే విక్రమాదిత్యుని బ్రతికించి "సుఖముగా జీవించు"డని ఆశీర్వదించి పంపెను.

ఇంటికి వెళ్ళిన తరువాత విక్రమాదిత్యుడు భట్టిని చూచిసోదరా ! నేను దేవేంద్రుని నుండి వెయ్యి సంవత్సరములు జీవించునట్లు వరము పొందితిని. నీవు కాళీమాత వలన రెండువేలేండ్లు జీవించునట్లు వరము పొందితివి. నన్ను వదలి ఒక క్షణమైనను గడపలేని నీవు నేను మరణించిన తరువాత వేయి సంవత్సరములు బ్రతికి యుండగలవా?" అని అడిగెను.

అది విని భట్టి నవ్వి "రాజా! నాతోపాటు నీవుకూడ రెండువే సంవత్సరములు జీవించవచ్చును. దేవేంద్రుడు నీకు యిచ్చిన వరము వెం సంవత్సరములు రాజ్యపాలన చేయుదువని గదా! నేను కాళీమాత వలన రెం వేల సంవత్సరములు జీవించునట్లు వరము పొందితిని. నీవు సంవత్సరమునక ఆరు మాసములు రాజ్యపాలన చేయుము. మిగిలిన ఆరు మాసములు వినోద యాత్రలతో, తీర్థయాత్రలతో గడుపుచుండుము. నీవు ఆ విధముగా వెళ్ళి నప్పుడు రాజ్యపాలన నేను చేయుచుందును. ఇట్లు చేసినచో నాతోపాటు నీ కూడ రెండువేలయేండ్లు జీవించగలవు. దేవేంద్రుడిచ్చిన వరము ప్రకారమ వెయ్యి సంవత్సరములు మాత్రమే రాజ్యపాలన చేసినట్లగును. ఇదీ నాకుతోచిన ఉపాయము. అటుపై మీ ఇష్టము" అని చెప్పెను.

భట్టి చెప్పిన మాటలు విని విక్రమాదిత్యుడు అమిత సంతోషము

పొంది, తమ్ముని కౌగలించుకొని "సోదరా ! నీ బుద్ధి బలచాతుర్యములు కొనియాడ దగినవి. నీవు సూచించిన పద్ధతి ప్రకారము రాజ్యపాలనచేసి రెండువేలేండ్లు కలసి మెలసి ఉందము" అని పలికెను.

విక్రమాదిత్యుడు ఆనాటి నుండి సంవత్సరములో ఆరు మాసములు రాజ్యపాలన చేయుచు, మిగిలిన ఆరుమాసములు విలాసయాత్రలు, తీర్థ యాత్రలు, వేటాడుట మొదలగు పనులు చేయుచు గడుపుచుండెను. విక్రమా దిత్యుడు నగరములో లేని ఆరు మాసములు భట్టి రాజ్యపాలన చేయుచుండెను. ఈ విధముగా, భట్టీ-విక్రమాదిత్యులు రాజ్యమును పరిపాలించుచు ప్రజలకు సుఖశాంతులు కలిగించుచుండిరి. దేవేంద్రుడొసగిన నవరత్న ఖచితమయ స్వర్ణ సింహాసన మధిష్టించి వారు ధర్మము తప్పక రాజ్యపాలన చేయుచు, దేశ విదేశములలో గొప్ప ఖ్యాతి నందుచుండిరి.

## భేతాళుని కథ

ప్రాచీనకాలమున పరమేశ్వరుడు పార్వతీదేవితో ఏకాంతముగనున్న పుడు ఒకనాడు, రాత్రిసమయమున పార్వతీదేవి పరమేశ్వరునకు నమస్కరించి "నాథా! ఈలోకములో ఎవరికినీ తెలియని చిత్రవిచిత్రమైన కథలేవైన చెప్పుడు" అని ప్రార్థించెను. పార్వతీదేవి కోరికవిని పరమేశ్వరుడు ఆనందించెను. "దేవీ! నీవు కోరిన ప్రకారము ఇంతవరకు ఎవరికినీ తెలియని చిత్రవిచిత్రమైన కొన్ని కథలు చెప్పెదను. విని ఆనందించుము" అని సూర్యోదయము వరకు కొన్నికథలు చెప్పి ముగించెను.

ఆ రాత్రి సమయమున పరమేశ్వరుని పూజించుటకొక బ్రాహ్మణుడు వచ్చియుండెను. అతడు పూజానంతరము ఇంటికిపోక గుడి సమీపమున నొకచోట

రహస్యముగ నక్కియుండెను. అట్లు నక్కియున్న బ్రాహ్మణుడు పార్వతీదేవికి పరమేశ్వరుడు చెప్పిన కథలన్నిటిని చక్కగా విని, ఇంటికిపోయి భార్యకు చెప్పెను. అతని భార్య ఆ కథలను యిరుగుపొరుగు స్త్రీలకు చెప్పెను.



పార్వతీదేవికి పరమేశ్వరుడు కథలు చెప్పుట
వానిని చాటున ఉండి బ్రాహ్మణుడు వినుట

ఈ విధముగా పరమేశ్వరుడు పార్వతీదేవికి చెప్పిన కథలు లోక మంతట తెలిసిపోయినవి. ఆ సంగతి పార్వతీదేవికి తెలిసినది. ఆమె కోపము చెంది,

పరమేశ్వరునిచూచి "స్వామీ! మీరు నాకు ప్రపంచంలో ఎవ్వరికీ తెలియని చిత్ర విచిత్రమైన కథలు చెప్పెదమని మాటయిచ్చి లోకమంతటా చెప్పుకొనబడుచున్న కథలే చెప్పినారు. మీరిట్లు అబద్ధమాడుట ధర్మమగునా?" అని అడుగగా, పరమేశ్వరుడు ఆగ్రహము పొంది, దివ్యదృష్టిచే ఆ కథలు ఒక బ్రాహ్మణుడు రహస్యముగ తాము చెప్పుకొనుచున్నప్పుడు విని బయటపెట్టినాడని తెలిసికొని, ఆబ్రాహ్మణుని రప్పించి, "నేను పార్వతికి రహస్యముగ చెప్పినకథలు నీవు మా ఆజ్ఞ లేక బట్టబయలు చేసితివిగాన నీవు తక్షణము పిశాచమగుదువుగాక!" అని శపించెను.

పరమేశ్వరుని శాపము విని బ్రాహ్మణుడు గజగజ వణకుతూ "దేవదేవా! నా అపరాధము క్షమించి, శాపవిముక్తి కలుగుమార్గము తెలుపుడు" అని ప్రార్థించగా నందికేశ్వరుడు యిట్లుచెప్పెను- "కొంతకాలము గడచినతరువాత భూలోకమున విక్రమాదిత్యుడను రాజు జన్మించి చిరకాలము రాజ్యపాలనచేయును. ఆ రాజొక రుషికోరిక తీర్చుటకై నీవద్దకు వచ్చును. అప్పుడతనికి ఈ కథలన్నియు చెప్పిన పిమ్మట శాపవిముక్తుడవగుదువు" ఆమాటలు విని బ్రాహ్మణుడు కొంత తృప్తిపడెను. తరువాత కొంతసేపటికి పిశాచముగమారి, అరణ్యమునకేగి ఒక వృక్షముపై నివసించుచుండెను.

## శాంతశీలుడను యోగి విక్రమాదిత్యుని వద్దకు వచ్చుట

ఇది జరిగిన కొన్నివేల సంవత్సరములకు విక్రమాదిత్యుడు జన్మించెను. అతడు ఉజ్జయిని రాజధానిగా చేసికొని, భట్టి సహాయమున ఎంతో వైభవముగా రాజ్యమును పాలించుచుండెను.

ఇట్లు విక్రమాదిత్యుడు ఉజ్జయినిని పాలించుచున్న సమయమున శాంతశీలుడను నొకరుషి రాజును దర్శించుటకు వచ్చెను. అతడు రాజును దర్శించి

తనవెంట తెచ్చిన ఒక దానిమ్మపండును యిచ్చెను. రాజు దానిని తినకుండ, జాగ్రత్తపెట్టుడని రాజభటుల నాజ్ఞాపించెను. శాంతశీలుడు ప్రతిదినము రాజును దర్శించుటకు వచ్చినపుడెల్ల ఒక దానిమ్మపండునిచ్చి పోవుచుండెను. రాజు వాటిని తినక సభయందే వదలిపోవుచుండెను. రాజభటులు ఆ పండ్ల నన్నిటిని భద్రముగ తీసి ఒకచోట దాచుచుండిరి.

అట్లు జరుగుచుండగా ఒకనాడు శాంతశీలుడు యిచ్చిన దానిమ్మపండును ప్రక్కన కూర్చుండియున్న తన కుమారునిచేతికి యిచ్చెను. తలవని తలంపుగా అచ్చటికొక కోతివచ్చి బాలుని చేతిలోనున్న పండు నపహరించి, కొరికి తినబోగా ఆ పండునుండి జలజల రత్నములు రాలెను. వానిని చూచి రాజు ఆశ్చర్యపడి ఇంతకుముందు ఆ రుషి యిచ్చిన పండ్ల నుతెమ్మని భటుల కాజ్ఞయిచ్చెను. రాజభటులు జాగ్రత్తగ దాచిన పండ్లనన్నిటిని తెచ్చి రాజుముందు పెట్టినారు. రాజు ఆ పండ్లనన్నిటిని పగులగొట్టించి చూడగా అన్నిటిలో వెలగల రత్నములు ఉండెను. వాటిని చూచి రాజు ఆశ్చర్యానందములు పొందెను.

మరునాడు శాంతశీలుడు యథాప్రకారము రాజును దర్శించుటకు వచ్చి, ఒక దానిమ్మపండు నిచ్చెను. అప్పుడు విక్రమాదిత్యుడు ఆ రుషినిచూచి "స్వామీ! మీరు ప్రతిదినము నావద్దకు వచ్చి, నన్ను ఆశీర్వదించి వెళ్ళుచున్నారు. మీరిట్లు వచ్చుటకేదైన కారణముండి యుండును. ఆ కారణమేదో తెలుపుడు. నా వలన మీకు కావలసినపని ఏదైనఉన్నచో చెప్పుడు. తప్పక చేసెద"నని పలికెను.

అది విని శాంతశీలుడు "మహారాజా! నేనపరపక్ష ద్వాదశినాడు అర్ధరాత్రి సమయమున శ్మశానమునందు యాగము చేయదలచితిని. మీరు ఒంటరిగా వచ్చి నాయాగము పూర్తియగునట్లు సహాయపడవలె"నని కోరెను. విక్రమాదిత్యుడు అందుకు అంగీకరించెను.

విక్రమాదిత్యుడు ఋషికి చెప్పిన ప్రకారము అపరపక్ష ద్వాదశినాడు, అర్ధరాత్రి సమయమున ఒంటరిగా నొకఖడ్గమును పట్టుకొని శ్మశానమునకు పోయి శాంతశీలుని ముందు నిలబడెను.

అప్పుడా శాంతశీలుడనుఋషి ప్రేతముఖమునందు హోమముచేయుచు, రాజునుచూచి ఎంతో ఆనందించి, "ఓ సత్యసంధుడా! మంచి సమయమునకు వచ్చితివి. ఇక్కడికి దక్షిణ పార్శ్వంబున నొకపెద్ద మఱ్ఱిచెట్టు గలదు. ఆ చెట్టుపై



విక్రమాదిత్యుడు భేతాళుని పట్టి బంధించి తెచ్చుట

నొక భేతాళమున్నది. దానిని నీవు పట్టితేవలెను. నీవు దానిని పట్టితెచ్చునప్పుడు దానితో నీవు మాట్లాడకూడదు” అని చెప్పెను.

రాజు “అట్లే చేసెద”నని, కొరవి చేతబట్టుకొని ఒంటరిగా ఆ చెట్టు వద్దకు వెళ్ళి చెట్టుపైనున్న భేతాళుని చూచెను. అప్పుడా భేతాళుడు తలక్రిందుగా కాళ్ళుమీదుగా వ్రేలాడుచుండెను. రాజు దానినిచూచి ఏ మాత్రము భయపడక, చెట్టుమీదికి పోయి, భేతాళుని ఈడ్చి క్రిందకుత్రోసి తాను చెట్టుదిగుసరికి ఆ భేతాళుడు నవ్వుచు నిముషములో పై కెగసి ముందువలె వృక్షమును పట్టుకొని వ్రేలాడుచుండెను.

అంతట రాజు మరల చెట్టుపైకిపోయి భేతాళునిపట్టి తన ఉత్తరీయముతో కట్టి వీపుపైనుంచుకొని క్రిందికి దిగివచ్చెను. అప్పుడు భేతాళుడు తన శాపవిమోచన సమయము దగ్గరైనదని తలచి “ఓ మహారాజా! శీఘ్రముగా త్రోవ జరుగుటకై నేనొక కథ చెప్పెదను విను”మని క్రింది విధముగా కథ చెప్పుచుండ విక్రమాదిత్యుడు మౌనముగా నుండి వినుచు, పోవుచుండెను.

## భేతాళుడు చెప్పిన-పద్మావతి కథ

“ఓ రాజా! గంగానదీ తీరమున తంజనగరమను నొకసుందరమైన పట్టణము కలదు. దానిని ప్రతాపుడు అనురాజు పాలించుచుండెను. అతనికిప్రభావతి యను భార్యయు, వజ్రముఖుడను కుమారుడును ఉండిరి. అతని మంత్రి కార్య ప్రధానుడనువానికి సద్బుద్ధియను నొకకుమారుడు కలడు. అతడు సకలవిద్యలు తెలిసినవాడు. రాజకుమారుడగు వజ్రముఖుడును, మంత్రిపుత్రుడగు సద్బుద్ధియు గాఢమగుస్నేహము కలిగి ఒకరినొకరు విడిచియుండక కలసిమెలసి ఉండెడివారు.

ఇట్లు జరుగుచుండగా ఒకనాడు రాజకుమారుడు సుబుద్ధితోకలసి వేటకు పోయెను. వారు అడవిలో చాలసేపు వేటాడి అలసిపోయిరి. దాహముతో బాధ పడుచు వెదకి వెదకి యొకచెరువును చూచి, కడుపార నీరుత్రాగి దాహము తీర్చు కొనిరి. అచ్చటనున్న నీడలో కూర్చుండి విశ్రాంతి తీసుకొనుచుండిరి.

అప్పుడచ్చటికి మిక్కిలి అందగత్తెయగునొక యువతి చెలికత్తెలతో కలసి వనవిహారమునకు వచ్చెను. రాజకుమారుడు ఆమె అందచందములు చూచి ముగ్ధుడై మోహించెను. ఆ యువతి కూడ రాజకుమారుని చక్కదనమును చూచి ముగ్ధురాలై అతనిని మోహించెను. ఆమె తన మోహము తన దగ్గరనున్న చెలి కత్తెలుకు, అతని వద్దనున్న చెలికానికి తెలియకూడదని భావించి, రాజకుమారుడు చూచునట్లు తన శిరమునందున్న తామరపూవునుతీసి కర్ణమునబెట్టి, పండ్లు కఱచు కొని, తరువాత కాలుత్రొక్కి మరల పాదంబుననిడుకొని, పిదప రొమ్మున బెట్టు కొనెను. ఈ విధముగ గుర్తుచూపి ఆ తటాకమున కొంతసేపు చెలికత్తెలతోకలసి జలక్రీడలాడి యింటికి పోయెను.

ఆమె యింటికి పోయినతరువాత రాజకుమారుడు తీవ్రమైన విచార ములో మునిగిపోయెను. సుబుద్ధి అతడట్లుండుటకు కారణము గ్రహించి "చెలికాడా! ఆమె నిన్ను రమ్మనెనుగదా! నీవెందుకు విచారపడుచున్నావు?" అని అడిగెను. సుబుద్ధి మాటలువిని రాజకుమారుడు ఆశ్చర్యపడి "మిత్రమా! ఆమె నన్ను రమ్మని చెప్పినట్లు ఏ ఆధారముపై నీవు చెప్పుచున్నావు?" అని ప్రశ్నించెను.

అప్పుడు సుబుద్ధి "మిత్రమా! ఆమె తనఅభిప్రాయమును ఇతరులకు తెలియకుండా నీకు కొన్ని గుర్తులద్వారా తెలిపెను. ఆగుర్తుల భావమేమో చెప్పె దను వినుము. ఆయువతి తనతలయందున్న పుష్పమును తీసి కర్ణమునందుంచు కొనుటద్వారా తనఊరు కర్ణపురమని, పండ్ల కరచుట ద్వారా బలముగలవాని

కుమార్తెనని, కాలు త్రొక్కుటద్వారా ఆ పురమునేలు రాజు కాళింగుడని, పాదము మీద ఉంచుకొనుట ద్వారా తనపేరు పద్మావతియని, వక్షమున నొత్తుకొనుట ద్వారా తనను కౌగలించగోరుచున్నట్లు ఉపాయముతో చెప్పినది. కావున నీవు విచారపడవలసిన పనిలేదు. ఆమె నిన్నుకలిసికొన గోరుచున్నదిగాన సంతోషముగా ఉండుము" అని తెలిపెను.

సుబుద్ధి మాటలువిని రాజకుమారుడు ఎంతో సంతోషించి, అతనిని వెంటబెట్టుకొని కర్ణపురమునకు పోయెను. అచ్చట వారొక ముసలిదానియింట బస చేసిరి.

వారా ముసలిదానిని మంచిచేసుకొని, విశేషధనమిత్తుమని ఆశపెట్టి పద్మావతివద్దకు పంపిరి. వృద్ధవనిత పద్మావతివద్దకు పోయి "నీవు చెరువువద్ద చూచిన రాజకుమారుడును, అతని స్నేహితుడును మన పట్టణమునకు వచ్చి నా యింట బసచేసినారు. రాజకుమారుడు నీకీ విషయము తెలియజేయగోరినందున వచ్చితిని" అని చెప్పగా, పద్మావతి యావృద్ధురాలిపై కోపించుచున్నట్లు నటించి "నీవు నాయింటికి మరెన్నడునురావద్దు"అని మందలించి యొకపుటికలో నా ముసలి దానిని కూర్చుండబెట్టి, పుటికకు త్రాడుకట్టి మేడమీదనుండి క్రిందికి దింపిపొమ్మన చెప్పెను.

ఆ వృద్ధురాలు యింటికివచ్చి వారితో జరిగిన సంగతులు చెప్పెను. ఆ సంగతులు విని రాజకుమారుడు దిగులుపడి సుబుద్ధివైపు దీనముగా చూడసాగెను. అప్పుడు సుబుద్ధి చిరునవ్వునవ్వి "మిత్రమా! ఆమె చాల తెలివైనది కావున తన ప్రవర్తన యితరులకు అర్థముకాకుండునట్లు తన అభిప్రాయములను యుక్తిగా తెలుపుచున్నది. ఆమె నీవు వచ్చిన సంగతివిని, ఏమియు యెరుగనట్లు ఆ ముసలి దానివద్ద నటించినది. ఆమె చేసిన చేతలద్వారా నీకు ఉపాయము చెప్పి పంపినది.

అర్ధరాత్రివేళ మేడక్రిందుగ జారవేసియున్న త్రాడును కదలించితివేని, ఆ సంజ్ఞ తెలుసుకొని ఆమె నిన్ను మేడపైకి చేదుకొనును. కావున నీవీ రాత్రి వెళ్ళి అట్లు చేయుము" అని చెప్పెను.

అదివిని రాజకుమారుడు ఎంతో ఆనందించి ఆనాటి అర్ధరాత్రి సమయమున పద్మావతి యున్నమేడవద్దకు వెళ్ళి త్రాడును కదలించగా, ఆమె గ్రహించి వెంటనే పైకిచేదుకొని, యతనితో సుఖముగా కాలము గడుపుచుండెను.



పద్మావతి మేడపై నుండి త్రాడు ద్వారా రాజకుమారుని పైకి లాగుకొనుట

ఇట్లు కొన్నిదినములు గడచిన తరువాత రాజకుమారునకు తన స్నేహితుడు జ్ఞాపకమునకు వచ్చెను. అప్పుడతడు 'అయ్యో! నామిత్రుడు సుబుద్ధి ఏమైనాడో, ఎట్లున్నాడో తెలిసికొనవలె'నని నిశ్చయించుకొని, పద్మావతితో నా మిత్రుని యోగక్షేమములు తెలుసుకొని వచ్చెదనని చెప్పగా, ఆమె అతడువెళ్ళి తిరిగివస్తాడో, రాడో అని సందేహపడి వెళ్ళవద్దని కోరెను. ఆమె అట్లు చెప్పగా రాజకుమారుడు తీవ్రవిచారము పొంది, ఆమెతో ముందువలె సంతోషముగా ఉండకుండెను.

అది గమనించి ఆమె రాజకుమారుడు తన చెప్పుచేతలలో ఉండవలెనన్న మంత్రి కుమారుని లేకుండ చేయవలెనని నిశ్చయించుకొని ఏమియు యెరుగనట్లు నటించుచు, రాజకుమారుని చేతికి కొన్ని మిఠాయిలు యిచ్చి "వీనిని తీసుకొని వెళ్ళి మీ స్నేహితునకు పెట్టుడు. మీరు మాత్రం తినవద్దు. అతనిని చూచి యోగక్షేమములు తెలుసుకొని, మీతోపాటు తీసుకొని రండు!" అని చెప్పినది.

పద్మావతి మాటలు విని రాజకుమారుడు చాల సంతోషించి, ఆమె యిచ్చిన మిఠాయిలను తీసుకొని తెల్లవారు ఝామున మేడక్రిందికి దిగి, తాము బసచేసిన ముసలిదాని యింటికి పోయెను.

అచ్చట సుబుద్ధి క్షేమముగా ఉండెను. ఒకరినొకరు చూచుకొని యెంతో ఆనందించిరి. రాజకుమారుడు జరిగిన సంగతులన్నియు చెప్పి పద్మావతి యిచ్చిన మిఠాయిలు అతనికి యిచ్చెను.

సుబుద్ధి ఆ మిఠాయిలను తీసుకొని "మిత్రుడా! నేను ఇచ్చట ఉన్న సంగతి ఆమెకెందుకు చెప్పితివి? ఆమె నీ నుండి నన్ను దూరము చేయదలచియే ఈ మిఠాయిలు నీతో పంపినది." అనగా, రాజకుమారుడు ఆమె మంచి గుణవంతురాలని, నిన్ను ఒకసారి చూచి గౌరవించదలచుచున్నదని చెప్పెను.

అది విని, సుబుద్ధి రాజకుమారుని చేతిలోనున్న మూటనుండి ఒక భక్ష్యమును తీసి ఒక కుక్కముందు వేసెను. ఆ భక్ష్యమును తిన్న తక్షణము ఆ కుక్క మరణించినది. దానినిచూచి రాజకుమారుడు ఆశ్చర్యచకితుడైనాడు. స్త్రీలను నమ్మరాదని తలచి, పద్మావతిపై గల మోహమును తొలగించుకొన దలచినాడు.

అప్పుడు సుబుద్ధి రాజకుమారుని చూచి "మిత్రుడా! మనమీ పట్టణమున ఉండుట క్షేమముకాదు. పద్మావతి నెట్లయిన తీసుకొని మన పట్టణమునకు పోవలెను. అందుకు ఒక ఉపాయము తెల్పెదను వినుము. నీవీ రాత్రి పద్మావతి యింటికి తిరిగి వెళ్ళుము. ఆమెతో యథాప్రకారము సరససల్లాపము లాడుచు సంతోషముగా ఉన్నట్లు గడుపుము. ఆమె గాఢనిద్రలో నున్న సమయమున నా యువతి వక్షమున గోటితో మూడు గాయములు చేసి, ఆమె మెడలో నున్న రత్నాలహారమును తీసుకొనిరమ్ము. తరువాత జరుపదగిన పనులను జరుపుద"మని చెప్పెను.

సుబుద్ధి చెప్పిన ప్రకారము రాజకుమారుడు ఆనాటి రాత్రి ప్రభావతి వద్దకుపోయి, అతడు చెప్పినట్లుచేసి రత్నాలహారమును తెచ్చెను. తరువాత సుబుద్ధి యోగివేషము ధరించి స్మశానమునకు పోయి, అచ్చట ఉండి, రాజకుమారుని తన శిష్యుడుగా ఉండునట్లు ఒప్పించి, ఆ హారమును పట్టణములోని వారికి చూపించి, దానిని కోరిన వారిని తన వద్దకు తీసుకొని రమ్మని చెప్పెను.

రాజకుమారుడు ఆ రత్నాలహారమును పట్టుకొని పట్టణములో తిరుగుచు అందరికి చూపుచుండెను. ఆ సంగతిరాజు విని, అతనిని తన వద్దకు రప్పించుకొని, "ఈ హారము వెల ఎంత?" అని యడుగగా, నతడు "నాకు తెలియదు. ఆ విషయము నా గురువు నడుగుడు. ఆయన ఇచ్చటికి సమీపములో నున్న శ్మశానములో జపము చేసికొను చున్నా"డని చెప్పెను.

అది విని రాజు అతని వెంట బయలుదేరి శ్మశానములో జపము చేయుచున్న యోగి వేషమున నున్న సుబుద్ధి వద్దకు పోయి తనకు ఆ హారము యిమ్మని అడిగెను. అప్పుడా సన్యాసి "ఓ రాజా ! మాకు ఈ హారముయొక్క వెల యివ్వవలసిన అవసరములేదు. మేము అనేక దినములనుండి యిచ్చట నివసించుచున్నాము. మీ మంత్రి కుమారుడు ప్రతిదినము ఈ శ్మశాన వాటికకు వచ్చి పీనుగులను తినుచుండును. ఇట్లుండగ నిన్నరాత్రి మంత్రి కూతురు వచ్చి ప్రేతములను తినుచున్నది. నిన్నటి దిన మా యువతిని నా శూలముతో పొడిచి ఆమె యురమున నున్న రత్నాలహారమును తీసుకొంటిని. అటుపిమ్మట నా యువతి తన గృహమున కేగినది. కావున ఆ రాక్షసకాంత ఈ పట్టణమున ఉన్న యెడల గొప్పకీడు సంభవించ గలదు. స్త్రీలను చంపుట పాపము కనుక ఆమె కండ్లకు గంతలు కట్టి కారడవిలో విడిచిపెట్టుట మంచిది" అని చెప్పి హారమును రాజుకు యిచ్చెను.

తరువాత రాజు కోటకు పోయి తనవద్దకు మంత్రిని పిలిపించి "ఈ హార మెవ్వరి"దని యడుగగా, మంత్రి దానిని చూచి గుర్తించి "నాకుమార్తె"దని తెలిపెను. అప్పుడు రాజు యోగి చెప్పిన విషయములన్నియు మంత్రికి చెప్పి, ఆ యువతి రొమ్ముపై పడిన గాయములను పరిశీలింపచేసెను. మంత్రి ఆ గ్రామములను చూచి భయపడి రాజాజ్ఞననుసరించి ఆమె కండ్లకు గంతలు కట్టించి కారడవిలో విడిచిపెట్టించెను.

ఇట్లు జరిగిన తరువాత సుబుద్ధియు, రాజకుమారుడు తమ వేషములను తీసివేసి, మామూలు దుస్తులు ధరించి, కారడవికిపోయి పద్మావతిని కలుసుకొనిరి.

సుబుద్ధి సలహాపై రాజకుమారుడు ఆమెను తీసుకొని తన రాజ్యమున కేగి సుఖముగా ఉండెను.

ఓ విక్రమాదిత్యా! కథ వింటివి గదా! ఈ పాప మెవరికి చెందును? తెలిసి చెప్పకుంటివేని నిన్ను మ్రింగివేయుదు"నని భేతాళుడు చెప్పగా, విక్రమాదిత్యుడు అతని మాటలు విని, సంతోషించి "రాజకుమారుడు యౌవనావస్థలో నున్న వాడు కావున ఆ యువతిని ప్రేమించినాడు. రాజకుమారుడు అందగాడగుటచే నా యువతి ప్రేమించి, అతనితో రహస్యముగా సుఖించినది. మంత్రి కుమారుడు స్నేహధర్మము ననుసరించి రాజకుమారునకు సహాయపడినాడు. రాజు చక్కగా విచారించక పద్మావతిని అడవికి పంపినాడు కావున ఆ పాపము రాజుకు చెందును" అని విక్రమాదిత్యుడు చెప్పగా, భేతాళుడు సంతోషించి అతనికట్లనుండి తప్పించుకొని మాయమైపోయి మరల వటవృక్షముపై నిలిచెను.

## భేతాళుడు చెప్పిన బ్రాహ్మణకన్య కథ

పరాక్రమవంతుడగు విక్రమాదిత్యుడు వెంటనే ఆవటవృక్షముపైకి పోయి మరలభేతాళుని పట్టి బంధించి తన వీపుపై కట్టుకొని, ముని వద్దకు వచ్చుచుండగా భేతాళుడు రాజు నుద్దేశించి "ఓ విక్రమాదిత్య మహారాజా! నేనొక ఆశ్చర్యకరమైన కథ చెప్పుచున్నాను వినుము.

విశ్వావసుడను నొక బ్రాహ్మణుడు కలడు. అతడు వేదశాస్త్రములు బాగుగా చదివినవాడు. అతనికి లేకలేక ఒక కన్య కలిగెను. ఆ కన్యక మిక్కిలి సౌందర్యముగా ఉండెను. తల్లితండ్రులు తగిన వరుని చూచి ఆమెకు వివాహము చేయవలెనని నిశ్చయించుకొనిరి.

ఇట్లుండగా వారి యింటికి ముగ్గురు అందమైన బ్రాహ్మణ యువకులు వచ్చి, ఆ కన్య యొక్క అందచందములు చూచి ముగ్ధులై ఆమెను వివాహమాడ గోరిరి. తాము నేర్చిన విద్యలను గూర్చి విశ్వావసునకు చెప్పుకొనిరి. విశ్వావసుడా ముగ్గురు యువకులను పరీక్షించి, ఆ ముగ్గురునూ సమర్థులే యని దృఢపరచుకొని, వారిని చూచి "మీరు ముగ్గురూ మాకు నచ్చినారు. కావున మీలో ఎవనికి మా కన్యనిచ్చి వివాహముచేయవలెనో మేము నిశ్చయించుకొనలేకున్నాము. మీరు ముగ్గురూ ఆలోచించుకొని, మీలో నొకరు మా కన్యను వివాహమాడుటకు సమ్మతించిన యెడల వివాహము చేయుదును" అని చెప్పినాడు.

ఆయన మాటలు విని, వారా కన్యపై గల మోహముచే ఒకరు చేసికొనుటకు మరొకరు అంగీకరించక తగవుపడి, దుర్భాషలాడుకొని, విశ్వావసుని వద్దకు వెళ్ళి "అయ్యా! మేము దూరదేశమునకు పోవుచున్నాము. అచ్చట మా తగవు తీర్చుకొని ఒక అంగీకారమునకు వత్తుము. మేము తిరిగి వచ్చునంతవరకు ఈ కన్య నెవరికీ వివాహము చేయవద్దు" అని కోరిరి. విశ్వావసుడు అందుకు అంగీకరించగా, వారు దూరదేశమునకు పోయిరి.

ఆ విధంగా వెళ్ళిన యువకులు చాలకాలం వరకు తిరిగి రాలేదు. ఈలోపుగా ఆ కన్య మరణించినది. తల్లిదండ్రులా కన్య శవమును శ్మశానమునకు తీసుకొనిపోయి దహన సంస్కారాలు గావించి యింటికి వచ్చిరి.

దూరదేశముననున్న ఆ బ్రాహ్మణ యువకులకెట్లో ఆమె మరణవార్త తెలిసినది. అంతట వారు ముగ్గురు ఆ గ్రామమునకు వచ్చి ఆమెను దహనము చేసిన స్థలమునకు పోయి మిక్కిలి దుఃఖించిరి. తరువాత వారిలో నొకడు ఆ

కన్య యొక్క బూడిదను తీసి శరీరమంతకు పూసికొని ఆ స్మశానములోనే కాచు కొని యుండెను. మరియొకడు ఆ కన్యయొక్క శల్యముల నెత్తుకొని కాశీకి వెళ్ళెను. మూడవవాడు ఆమెయందు గల అధికమోహం వలన నేమియు తోచక పిచ్చివానివలె పరదేశములకు పోయి తిరుగుచుండెను. అతడట్లు తిరుగుచు ఒక నాడు ఒక బ్రాహ్మణుని యింటికి పోయి అన్నము పెట్టమని కోరెను.

ఆ బ్రాహ్మణుడు జాలిపడి భార్యను పిలిచి ఈ బ్రాహ్మణ యువకునకు అన్నము పెట్టుమని చెప్పితాను స్నానము చేయుటకు పోయెను. అప్పుడా బ్రాహ్మణస్త్రీ అన్నము వండుటకు కట్టెలు లేక, తన కొడుకును చంపి పొయ్యిలో పెట్టి మంటచేసి అన్నము వండెను. తరువాత ఆ పొయ్యిలోని బూడిదనంతను ఒకచోట చేర్చి, దానిపై నుదకమును చల్లి ఒక పుస్తకముతో కొట్టెను. అప్పుడా బూడిదనుండి ఆమె కుమారుడు వెలికివచ్చెను. అది యా బ్రాహ్మణ యువకుడు చూచి ఆశ్చర్యపడి, ఈ యుపాయముతో విశ్వావసుని కుమార్తెను బ్రతికించవచ్చునని తలచి, భోజనముచేసి అచ్చట కొంతసేపు పయనించినట్లు నటించి, ఆ పుస్తకమును సంగ్రహించి ఆ బ్రాహ్మణ కన్యను దహనముచేసిన స్థలమునకు వెళ్ళెను.

అదే సమయమునకు గంగాస్నానమునకు కాశికేగిన బ్రాహ్మణ యువకుడుకూడ అచ్చటికి వచ్చెను. మరియొకడు ఆ కన్యయొక్క బూడిదను శరీరమునకు పూసికొని అచ్చటనే కనిపెట్టుకొని యుండెను. పుస్తకమును తెచ్చిన యువకుడు బూడిదనంతను ఒకచోట చేర్చి దానిపై నుదకముచల్లి ఆ పుస్తకముతో కొట్టెను. వెంటనే ఆ కన్య బ్రతికెను. అంత నా ముగ్గురు యువకులు పరమానందము పొంది, నేను వివాహమాడుదునంటే, నేను వివాహమాడుదునని తగవు పడసాగిరి.



బూడిదనుండి పుట్టిన కన్యకై తగవు పడుచున్న బ్రాహ్మణ యువకులు

కాబట్టి ఆ ముగ్గురిలో ఆ కన్య యెవరికి భార్యయగుట న్యాయము?" అని భేతాళుడు అడుగగా, విక్రమాదిత్యుడు "ఆ కన్యయొక్క శల్యములను తీసుకొని గంగానదికి పోయినవాడు పుత్రుడనదగును బ్రతికించినవాడు తండ్రివంటివాడు, శ్మశానమునందుండి ఆమెను దహనముచేసిన స్థలమున బూడిదను కాచుకొనియున్నవాడు ఆమెకు భర్త కాదగును" అని చెప్పగా, భేతాళుడు సంతోషించి, వీపుపైనుండి మాయమై చెట్టు పైకిపోయి ఎప్పటివలెనుండెను.

# భేతాళుడు చెప్పిన - రెండు చిలుకల కథ

విక్రమాదిత్యుడు తిరిగి ఆ వటవృక్షముపైకి పోయి భేతాళుని పట్టి, బంధించి, తీసుకొని వచ్చుచుండగా మరల నొకకథ చెప్పసాగెను.

పూర్వము ఉమావతియను పట్టణము వుండెను. దానిని కేసరియను రాజు పాలించుచుండెను. అతనవద్ద భూత భవిష్య ద్వర్తమానములను తెలుపగల ఒక చిలుక ఉండెను. ఒకనాడు ఆ రాజు చిలుకను చూచి" నీవు మూడు లోకములలో జరుగు విశేషములను చెప్పగలవుకదా! నాకు భార్యగా రాబోవు స్త్రీ ఎచ్చటనున్నదో చెప్పు"మని అడిగెను.

రాజు మాటలువిని ఆ చిలుక "రాజా! మగధదేశమున చంద్రలోచనుడను రాజు కలడు. అతనికి చంద్రమతియను కుమార్తె ఉండెను. ఆ కన్యయొక చిలుకను పెంచుచున్నది. అదికూడ భూత భవిష్య ద్వర్తమానములు తెలుపగలదు. ఆ చిలుక నీవు చంద్రమతికి భర్తవగుదు వని చెప్పినది. కావున నీకు ఆ స్త్రీ భార్య కాగల"దని చెప్పెను.

ఆ శుకరాజము చెప్పిన మాటలువిని రాజు సంతోషించి మగధదేశమునకు పురోహితులను పంపి, చంద్రమతిని తనకిచ్చి వివాహము జరిపించుడని కోరగా, చంద్రలోచనుడు అందుకు అంగీకరించి, తన కుమార్తెను కేసరికి యిచ్చి వివాహము జరిపించెను, తరువాత ఆ రాత్రి రాజకుమారుని, రాజపుత్రిని శయ్యాగృహమునకు పంపిరి.



రాజు రాణి మంచముపై పవళించి యుండగా రెండు చిలుకలు తగవుపడుట

అప్పుడా రాజు తన మగచిలుకను, తన భార్యయొక్క ఆడు చిలుకను ఒక పంజరము నందుంచెను. అంతట మగచిలుక మిక్కిలి సంతోషముతో ఆడు చిలుకను కూడి క్రీడించ నారంభించగా, ఆడుచిలుక దానిని దగ్గరకు రానియ్యక 'మగ వారిని నమ్మకూడ"దని చెప్పెను. అది విని మగచిలుక కోపించి "స్త్రీలనునమ్మరా" దని చెప్పెను.

మగచిలుక మాటలకు ఆడుచిలుక ఆడుచిలుక మాటలకు మగచిలుకకోపించి తగవుపడి రాజు సన్నిధికేగి తమ వివాదము తెలిపినవి. అప్పుడు ఆడుచిలుక తన మాటను సమర్థించుకొనుటకు ఈ కథ చెప్పినది.

మధురాపురమను పట్టణము కలదు. అందు ధర్మదత్తుడను ఒక వర్తకుడు ఉండెను. అతనికి దత్తుడను పుత్రుడు కలిగెను. అతడు చిన్నతనములోనే తల్లిదండ్రులను పోగొట్టుకొనెను. వాడు చెడు స్నేహములుచేసి, వారకాంతలతో విహరించుచు, తల్లిదండ్రులు సంపాదించిన ధనమంతయు వ్యయముచేసి,దరిద్రుడై దేశద్రిమ్మరియై తిరుగుచు చందనావతియను పట్టణమునుచేరి హిరణ్యకుడు అనే ఒక వర్తకుని కలిసి అతనితో తన వృత్తాంతమంతయు చెప్పి, తాను చేయగల వర్తకముల గూర్చి తెలుపగా, ఆ వర్తకుడు అతని శక్తి సామర్థ్యములకు సంతోషించి, తనకు సహాయముగా ఉండదగిన వ్యక్తి అని భావించి, తన పుత్రికనిచ్చి పెండ్లిచేసి తన యింటనుంచుకొనెను.

దత్తుడు కొంతకాలం మామగారియింట నమ్మకముగా ఉండి వ్యాపారం చేసి చాల మెప్పుపొందెను. పిమ్మట నొకనాడు మామగారితో "నేను చాలదినముల క్రిందట స్వస్థలమును విడిచిపెట్టితిని. నా బంధుమిత్రులను చూచి త్వరలో తిరిగి వచ్చెదను. నాభార్యను వారందరికి చూపించి, నాలుగు దినములుండి వచ్చెద"ననగా హిరణ్యకుడు సంతోషించి, తన కుమార్తెకుగల వెలగల నగలన్నిటినిపెట్టి అతనితో పంపెను. అల్లునికి కూడ వెలగల వస్త్రభూషణములొసగెను.

దత్తుడు భార్యతోకలసి కొంతదూరము పోయిన తరువాత భార్యను చూచి "ఓసీ మనము పోవుదారిలో దొంగలధికంగా నివసించుచున్నారు. కనుక నీ

ఆభరణములనన్నిటిని తీసి యిమ్ము. మూటగట్టి నావద్ద జాగ్రత్తపెట్టుదును" అని నమ్మబలికి. ఆమెవద్దనున్న నగలనన్నిటిని పుచ్చుకొని, ఆమెనొక పాడుబావిలో పడవేసి తనపాత స్నేహితులైన వేశ్యలకు ఆ నగలనుయిచ్చి వారితోకలసి దుర్మార్గమున సంచరించసాగెను.

అతడట్లుండ, బావిలో త్రోయబడిన హిరణ్యకుని కుమార్తె బిగ్గరగా ఏడ్చుచుండగా, కొందరు బాటసారులు ఆమె యేడ్పువిని బావినుండి పైకితీసి ఆమె వృత్తాంతమంతయు తెలిసికొని, తండ్రియింటికి పంపిరి.

ఆ యువతి పుట్టింటికి పోగానే తల్లిదండ్రులు నీ భర్త ఏమైనాడని అడుగగా, మేము అడవి మార్గమున పోవుచుండగా దొంగలువచ్చి మా వద్దనున్న నగలనన్నిటిని దోచుకొనడమేగాక, నా భర్తనుకూడ పట్టుకొనిపోయినారని చెప్పినది, ఏనాటికైనా తనభర్త తనవద్దకు రాగలడను నమ్మకముతో, తల్లిదండ్రులకు అతనిపై కోపము కలుగకుండ చేయుటకు అట్లు చెప్పినది.

అప్పుడు ఆ యువతి తల్లిదండ్రులు, బంధువులు ఆమెకు ధైర్యము చెప్పి విచారమును పోగొట్టిరి. దత్తుడు మాత్రము భార్యనుండి దోచుకొన్న నగలు మొదలగువాటి నన్నిటిని వేశ్యలపాలు చేసి, దరిద్రుడై మామగారియింటికి పోయి మాయమాటలు చెప్పి మరికొంత ధనము సంపాదించుకొని రావలెనని నిశ్చయించుకొని అత్తవారియింటికి బోయెను. మామగారితోనతడు తన భార్య వ్యాధిగ్రస్తురాలై చనిపోయినదని చెప్పవలెననుకొనెను.

అట్టి దుర్బుద్ధితో అత్తవారింటికిపోయిన దత్తునకచట గుమ్మములోనే అతని భార్య కనబడినది. ఆమెనుచూచి అతడు పారిపోవుటకు సిద్ధపడుచుండగా

ఆమె మగని వెంటపడి ఆపి, "మీరు భయపడిపారిపోవలసిన పనిలేదు. నేను మా తల్లిదండ్రులతో దొంగలు నానగలను దోచుకొన్నారనీ, మిమ్ముకూడ తీసుకొని పోయినారని చెప్పితిని. కావున వారు మిమ్ముచూచి సంతోషముగా ఆదరింతురుగాని అన్యథాచేయరని" చెప్పి యింటికి తీసుకొనివెళ్ళెను. తిరిగి వచ్చిన అల్లుని చూచి అత్తమామలు ఎంతో ఆనందించి, పూర్వమువలెనే చూచుచుండిరి.

ఉన్నట్లుండి భర్తుడు ఒకనాటి రాత్రి గాఢనిద్రలోనున్న భార్య గొంతు కోసి, ఆమె వద్దనున్న ఆభరణములను అన్నిటిని తీసుకొని పారిపోయి పూర్వము వలెనే వేశ్యల యిండ్లకు పోయి కాలము గడుపసాగెను. తమ కూతురు దుర్మరణము పొందినందుకు తలిదండ్రులు త్వరని దుఃఖము పొందిరి. కావున మగవారి నెన్నటికినీ నమ్మరా"దని ఆడుచిలుక చెప్పెను.

ఆడుచిలుక చెప్పిన కథవిని మగచిలుక రాజును చూచి "మహారాజా! నేనొక కథ చెప్పుచున్నాను, వినుడు" అని ఈ క్రింది కథ చెప్పెను.

రక్షితయను పేరుగల పట్టణము కలదు. దానిని ధర్మదత్తుడను రాజు పాలించుచుండెను. ఆ యూరిలో ధనగుప్తుడను వర్తకునకు వసుమతి యను కూతురు ఉండెను. ధనగుప్తుడు తన పుత్రికను సముద్రగుప్తుడు అనువానికి యిచ్చి పెండ్లి చేసెను. వసుమతి, సముద్రగుప్తులు సుఖముగా కాపురము చేయుచుండిరి. ఇట్లుండ సముద్రగుప్తుడు విశేషధనమార్జించు తలంపుతో విదేశములకు పోయెను.

భర్త విదేశములకు పోయిన తరువాత వసుమతి ఒక బ్రాహ్మణుని ప్రేమించి, అతనితో రహస్యముగ కాలము గడుపసాగెను. ఇట్లు కొన్నాళ్ళు

జరిగిన తరువాత సముద్రగుప్తుడు విదేశములనుండి తిరిగి వచ్చెను. అతడు తన భార్యపైనెట్టి అనుమానము పెట్టుకొనక పూర్వమువలె ఎంతో యిష్టముగా చూచుచుండెను. ఆమెకు వెలగల నగలు, బట్టలు మొదలగునవి తెచ్చి యిచ్చెను.

భర్త ఎంతో ప్రేమగా చూచుచున్నను వసుమతి తన ప్రియుడగు బ్రాహ్మణుని యందుగల మోహమును విడువలేక, ఒక చెలికత్తెను పంపించి, అతనిని కలియుటకొక సంకేతస్థలమును తెలియజేయించి అచ్చట కలిసికొనుటకు ఉపాయము తెలిపెను.

ఆమె కబురుచేసిన ప్రకారము ఆ బ్రాహ్మణుడు అర్ధరాత్రి సమయమున బయలుదేరి వచ్చుచుండగా రాజభటులు చూచి దొంగ అని భావించి బాణము విడువగా నది వానికి గాఢముగా నాటెను. అంత నాతడు కెవ్వుమని అరచి క్రిందపడి గిలగిల కొట్టుకొనుచున్న సమయమున వసుమతి అచ్చటికి వచ్చెను. ఆ సమయమున నా బ్రాహ్మణుడు మరణావస్థలో నుండెను. వసుమతి అతడు నిద్రించుచున్నట్లు నటించుచున్నాడని తలచి, ప్రేమాతిశయముతో నతని దగ్గరకు పోయి, గాఢాలింగనము చేసికొని ముద్దుపెట్టుకొనునప్పుడు ఆమె ముక్కు బ్రాహ్మణుని నోటిలో నిరుకుకొనెను. అదే సమయమున వాని ప్రాణము పోయినందున వాని నోరు మూసికొనిపోయినది. వసుమతి ముక్కు అతని నోటిలో బిగిసిపోయినందున తెగిపోయినది.

అప్పుడా యువతి తన ప్రియుడు చనిపోయినాడని గ్రహించి, ముక్కువద్ద బట్ట అడ్డుపెట్టుకొని వేగముగా యింటికిపోయి, గోడుగోడున ఏడ్చుచు నా భర్త నా ముక్కు కోసినాడని అందరిని పిలువనారంభించినది. ఇంటిలో నిద్రపోవు

చున్న ఆమె భర్త ఏడ్పులు బొబ్బలువిని లేచి, నా భార్య యిట్లు అబద్ధమాడు చున్నదేమిటా అని ఆశ్చర్యపడుచుండెను. ఇరుగు పొరుగువారువచ్చి ఆమెభర్తను నిందింపసాగిరి. వసుమతి దొంగ ఏడ్పులను, మాటలను నమ్మి ఇరుగు పొరుగు వారు ఆమె భర్తను రాజువద్దకు త్రీసుకొనిపోయి, అతడు తన భార్య ముక్కును కోసినాడని ఫిర్యాదు చేసిరి. రాజు వారి మాటలు నమ్మి అతనికి కఠిన శిక్ష విధించెను.

ఇంతలో రాత్రి పట్టణములో కావలియున్న రాజభటులు వచ్చి రాజుకు జరిగిన వృత్తాంతమంతయు చెప్పి, ఆ బ్రాహ్మణుని మృతదేహమును తెప్పించి రాజు ముందుంచిరి. రాజు ఆ బ్రాహ్మణుని నోరు తెరపించి అందున్న వసుమతి ముక్కును వెలికి తీయించి అందరి యెదుట పెట్టించెను. వసుమతి చేసిన చెడుపనికి రాజు ఆగ్రహించి, ఊరినుంచి వెళ్ళగొట్టించెను. కావున స్త్రీలను నమ్మరాదు". అని మగచిలుక చెప్పెను.

రెండు చిలుకలు చెప్పిన కథలను రాజు శ్రద్ధగా విని ఏమి చెప్పుటకును తోచక యూరకుండెను. కనుక ఓ విక్రమాదిత్య మహారాజా! ఆ రెండు చిలుకలలో నేది అపజయము పొందు"నని భేతాళుడు ప్రశ్నించగా, "పురుషులలో నెవడైన ఒకడు దుర్మార్గము చేయునుగాని అందరూచేయరు. స్త్రీలు అతిపాపిష్ఠులు కనుక పాపమునకు భయపడరు. అందువలన ఆడుచిలుక ఓడిన"దని విక్రమాదిత్యుడు చెప్పగా, భేతాళుడు విని ఆనందించి మరల చెట్టుపైకి పోయి నిలిచెను.

# భేతాళుడు చెప్పిన-వీరవరుని కథ

అంతట విక్రమాదిత్యుడు మరల చెట్టుపైకెక్కి భేతాళుని పట్టుకొని బంధించి తెచ్చుచుండగా, అతడు మరియొక కథ నిట్లు చెప్పసాగెను.

పూర్వము సోమావతియను పట్టణము ఉండెను. దానిని సూత్రమతి యను రాజు పాలించుచుండెను. అతడు సోమప్రభయను కన్యను వివాహమాడి సుఖముగా కాలము గడుపుచుండెను.

ఇట్లుండగా ఒకనాడొక బ్రాహ్మణుడు ఆ రాజు వద్దకు కుటుంబ సహితముగా వచ్చి తనకు కొలువు యిప్పించమని కోరెను. రాజు ఆ బ్రాహ్మణుని కోరిక విని "నీవు ఎవరు? ఎక్కడినుండి వచ్చినావు? ఏమి పని చేయగలవు?" అని అడుగగా, నతడు "నేను మాళవదేశమునుండి వచ్చితిని. బ్రాహ్మణుడను. నాకు మాసమునకు అయిదువందల వరహాలు జీతము యిప్పించుడు. నేను కోరినట్లు నన్ను మీ కొలువులో ఉంచుకొన్న యెడల మీకు ఆపద కలిగినప్పుడు సహాయ పడుదును" అని చెప్పెను.

అందుకు రాజు సమ్మతించి, అతడు కోరినట్లు జీతమిచ్చుటకు ఒప్పుకొనెను. అతడు కుటుంబముతో నివసించుటకు ఒక మేడ కట్టించి యిచ్చి,ఎంతో గౌరవముగా చూచుచుండెను. ఇట్లు కొన్ని దినములు గడచిన పిమ్మట రాజు ఆ బ్రాహ్మణుడు ఎట్లు ప్రవర్తించుచున్నాడో తెలుసుకొని చెప్పుడని కొందరు గూఢ చారులను నియమించెను. వారు ఆ బ్రాహ్మణుని గూర్చి బాగుగా విచారించి రాజు వద్దకువచ్చి "మహారాజా! ఆ బ్రాహ్మణుడు మీరు యిచ్చుచున్న ధనములో ప్రతి

నెలా రెండువందల వరహాలు దేవాలయములకు, రెండువందల వరహాలు బ్రాహ్మణాగ్రహారములకు, వందవరహాలు తన కుటుంబ ఖర్చులకు వినియోగపరచుచున్నాడు" అని చెప్పిరి. వారు చెప్పిన మాటలు విని రాజు ఎంతో ఆనందించి, అతనిని ముందుకంటె మరింత గౌరవముగా చూడసాగినాడు.

ఆ బ్రాహ్మణుడు రాజువద్ద కొలువు సంపాదించినప్పటినుండి, ఎల్ల వేళల ఆయన వద్దనేవుండి కంటికి రెప్పవలె కాపాడుచుండెను. రాజువద్దనున్న సర్దారులలో నతడు వీరవరుడని బిరుదు పొందెను.

ఇట్లు జరుగుచుండగా ఒకనాడు అర్ధరాత్రి సమయమున ఎచ్చటి నుండియో యొక స్త్రీ రోదనము వినబడసాగినది. రాజు ఆ ఏడుపు విని అంతఃపురమునుండి బయలుదేరి వచ్చుచుండగా వీరవరు డాయనకు ఎదురుపడినాడు. రాజు అతనిని చూచి ఆ ఏడుపు ఎచ్చటనుండి వచ్చుచున్నదో విచారించి రావలసినదని ఆజ్ఞాపించెను. వీరవరుడు 'చిత్తమట్లే చేసివత్తు'నని రాజుకు చెప్పి వెళ్ళిపోయెను. రాజు అతడు వెళ్ళిన తరువాత ఏమి చేయునో పరిశీలింపవలెనని తలచి, రహస్యముగ అతని ననుసరించి పోయెను.

వీరవరుడు ఏడ్పుధ్వని వచ్చుచున్న దిక్కుగా పోయెను. అతడు పట్టణము చివరకు పోగా అచ్చట నొకస్త్రీ కనబడెను. ఆమె అచ్చట కూర్చుండి బిగ్గరగా ఏడ్చుచుండెను. వీరవరుడు ఆమెవద్దకుపోయి "ఇంత రాత్రివేళ ఇచ్చట కూర్చుండి ఏడ్చుచున్న నీ వెవరివి? ఎందుకు ఏడ్చుచున్నావు?" అని అడుగగా, ఆ స్త్రీ "ఓయీ! నేనీ పురదేవతను. ఈ పట్టణము నేలుచున్న రాజుకు ఒకగొప్ప ఆపద రాబోవుచున్నది. అతడు మిక్కిలి ధార్మికుడు కావున విచార మాపుకొనలేక ఏడ్చుచున్నా"నని చెప్పెను.

ఆమె మాటలు విని వీరవరుడు "తల్లీ! మా రాజుకు రానున్న ఆపద ఎట్లు తొలగునో దయయుంచి తెల్పు"మని వేడుకొనగా, ఆమె "ఒక బ్రాహ్మణ బాలుని ఇచ్చుటకి తీసికొనివచ్చి బలి యిచ్చిన యెడల రాజుకు రానున్న కీడు తొలగిపోవు" నని చెప్పెను. ఆ మాటలు విని వీరవరుడు వెంటనే తన యింటికిపోయి, భార్యను పిలిచి పురదేవత చెప్పిన విషయము లన్నియు చెప్పి మన కుమారుని బలియిచ్చి రాజును కాపాడవలెనని తలచుచున్నాను. ఇందుకు నీవు యిష్టపడుదువా? అని యడుగగా, ఆ యిల్లాలు మీకు యిష్టమైన నాకును యిష్టమేయని చెప్పెను. తరువాత వారు తమ కుమారుని పిలిచి జరిగిన విషయములను తెల్పి నీ అభిప్రాయము తెల్పుమని యడుగగా, నా బాలుడు రాజును రక్షించుటకు నా ప్రాణమిచ్చుటకు సిద్ధముగా వున్నానని, మీరు తలపెట్టిన కార్యము చాల యోగ్యమయినదని చెప్పెను.

వీరవరుడంతట తన కుమారుని పురదేవతయగు కాళి గుడికి తీసుకొని వెళ్ళి, శుభ్రముగా స్నానము చేయించి, కాళి ముందు తల నరికి బలి యిచ్చెను. అదిచూచి ఆ బాలుని చెల్లెలు, తల్లి దుఃఖము భరించలేక మరణించిరి. భార్యయు, బిడ్డలు మరణించినందుకు వీరవరుడు చాల బాధపడి, నేను మాత్రము బ్రతికి లాభ మేమి? యని తలచి కాళిముందు నిలబడి "తల్లీ! నీవు చెప్పినట్లు చేసితిని. కావున ఈ పట్టణపు రాజును, ప్రజలను కాపాడు భారము నీదే!" యని, చేతనున్న ఖడ్గముతో తల నరకుకొని మరణించెను.

జరిగిన విషయము లన్నియు రాజు చూచి నా కొరకు ఇందరు ఏక కాలమున మరణించిరి. ఇట్టి ఉత్తములు పోయిన తరువాత బ్రతికి ఏమిలాభము అని తలచి ఖడ్గముతో తన శిరస్సును ఖండించుకొనబోవుచుండగా, మహాకాళి



వీరవరుడు దేవి ఎదుట కుమారుని చంపుట వెనుకనుండి రాజు చూచుట

అతని చేయి పట్టుకొని "రాజా! నీ ప్రాణము నిలుపుటకై యిందరు మరణించిరి. నీవు మరణించుటకు ప్రయత్నించుట న్యాయముకాదు. నీకు కావలసిన వరమేదైనా కోరుకొను మిచ్చెద"ననగా, రాజు ఆనందించి, "తల్లీ! నా క్షేమముకోరి మరణించిన ఈ నలుగురిని బ్రతికించుము. అంతకంటె నేను కోరదగిన వేమియు లేవని" చెప్పగా, మహాకాళి సంతోషించి ఆ నలుగురిని బ్రతికించెను.

రాజు వారికి తెలియకుండ తన కోటకుపోయి ఏమియు ఎరుగనట్లు ఉండెను. వీరవరుడు భార్యను, పిల్లలను యింటికిపంపి కాళీమాతకు నమస్కరించి రాజు వద్దకు పోయెను. రాజు వెళ్ళినపని ఏమైనదని అడుగగా, ఏడ్చుచున్న స్త్రీకి ధైర్యము చెప్పి, సంతోషము కలిగించి వచ్చితినని చెప్పెను.

వీరవరుని మాటలువిని రాజు మిక్కిలి ఆనందించి, రాత్రి జరిగిన విషయము లన్నియు ప్రజలకు చెప్పి, తన ప్రాణము కాపాడుటకు ప్రాణత్యాగము చేసిన వీరవరుని కుటుంబము ననేక విధముల కొనియాడి, అతని కనేక బహుమతుల నొసగి తనవద్ద మంత్రిపదవి నిచ్చి గౌరవించెను. కావున వారిలో నెవరు శ్రేష్ఠు"లని బేతాళుడు ప్రశ్నించెను.

అప్పుడు విక్రమాదిత్యుడు "యజమాని కొరకు నౌకరు ఎట్టి కార్యమునైన చేయుట ధర్మము. భర్త మాటప్రకారము చేయుట భార్యకు ధర్మము. తల్లిదండ్రుల యిష్టము ననుసరించి చేయుట పుత్రుని ధర్మము కాబట్టి వారు నలుగురు వారివారికి యోగ్యములైన కార్యములనే చేసిరి. అయితే వారి నిమిత్తము తన ప్రాణములను పోగొట్టుకొనుటకు సిద్ధపడిన రాజు మిక్కిలి న్యాయాధిపతి"యని చెప్పగానే, భేతాళుడు సంతోషించి, తిరిగి వృక్షము మీదికి పోయి ఉండెను.

## భేతాళుడు చెప్పిన-స్త్రీ భోగి, భోజనసుఖి, నిద్రాసుఖి అను వారి కథ

వంగదేశమున భూషణుడను బ్రాహ్మణుడు ఉండెను. అతనికి ముగ్గురు కొడుకులు కలిగిరి. ఆ బ్రాహ్మణుడు ఒక యాగము చేయదలచి తన

పుత్రులను పిలిచి మీరు సముద్రమునకు వెళ్ళి యొక కూర్మమును తీసుకొనిరండని చెప్పి పంపెను.

ఆ ముగ్గురు సముద్రమునకు వెళ్ళి ఒక కూర్మమును చూచి తమ్ముని పిలిచి దానిని యెత్తుకొని రమ్మని చెప్పగా వాడు నేను భోజన సుఖిని కనుకయెత్త జాలనని తెలిపెను. రెండవవానిని యెత్తమనగా వాడు నేను స్త్రీ భోగిని కావున యెత్తడములేదని చెప్పెను. జ్యేష్ఠుడు నేను నిద్రాసుఖిని కనుక యెత్తనని పలికెను.

ఈ విధముగా వారు తగవుపడి, విజయనగరమనే పట్టణమునకుపోయి, ఆ పట్టణము నేలుచున్న ప్రతాపుడను రాజువద్ద తమ వ్యాజ్యమును చెప్పుకొనిరి.

అప్పుడు ఆ రాజు వారి సామర్థ్యమును తెలుసుకొనవలెనని భావించి, ఒక స్త్రీని పిలిపించి, వెలగల వస్త్రభూషణములు ధరింపజేసి స్త్రీ భోగి వద్దకు పంప గానే వాడు ఆ స్త్రీని చూచి, ముక్కు మూసుకొని నీవద్ద దుర్వాసన కలదు వెంటనే వెళ్ళిపొమ్మని పంపివేసెను. ఆ సంగతి రాజు తెలుసుకొని, దాని తల్లిని పిలిపించి ఆ స్త్రీ పూర్వచరిత్ర తెలుపుమని యడుగగా "ఇది నా చెల్లెలి కూతురు. ఇది పుట్టిన అయిదు దినములకే నా చెల్లెలు మరణించినది. అప్పుడు దీనికి మేకపాలు పట్టించి పెంచితిని కావున దీని శరీరము దుర్వాసన కలిగియున్నది" అని చెప్పెను.

తరువాత రాజు మధురమైన పదార్థము వండించి భోజన సుఖిని పిలిపించి భోజనం చేయుమనగా, వాడు ఆ యన్నమును చూచి పీనుగుకంపు కొట్టుచున్నదని పలికి వదలిపెట్టెను. రాజు ఆ సంగతి విచారించగా, ఆ యన్నము శ్మశానము దగ్గరనున్న భూమిలో పండించిన వడ్లబియ్యముతో వండినందున అట్టి వాసన కలిగినదని గ్రహించెను.

పిమ్మట నా రాజు ఒక మృదువైన పరుపును తయారుచేయించి, నిద్ర సుఖిని పిలిపించి దానిపై పరుండుమని చెప్పగా, వాడా పరుపుపై పవ్వళించి వెంటనే పైకిలేచి పోయెను. అట్లేల చేసితివని రాజు అడుగగా ఆ పరుపులో నొకవెంట్రుక యుండి ఒత్తుకొనుటచే లేచిపోయితినని చెప్పెను. రాజు ఆ పరుపును విప్పించి చూడగా దానియందొక రోమముండెను.

రాజు వారు ముగ్గురు చెప్పిన విషయములు విని, వారికిగల సామర్థ్యమునకు సంతోషించి తగు బహుమతులు యిచ్చి గౌరవించెను. ఓ, విక్రమాదిత్య మహారాజా! ఆ ముగ్గురిలో ఎవరు అధిక సుకుమారులు?" అని భేతాళుడు ప్రశ్నించగా, విక్రమాదిత్యుడు "భోజనసుఖి, స్త్రీ సుఖి బుద్ధిచేత గ్రహించి చెప్పిరి. నిద్రాసుఖి పరుపులోనున్న వెంట్రుక వలన కలిగిన దద్దు వాని శరీరమున కానవచ్చెను. కావున వాడే మిగుల సుకుమారి"యని చెప్పెను. అది విని భేతాళుడు సంతోషించి, మరల పారిపోయి వృక్షము నెక్కి యెప్పటివలె నుండెను.

# భేతాళుడు చెప్పిన-జ్ఞాని, విజ్ఞాని, శూరులను వారి కథ

విక్రమాదిత్యుడు మరల చెట్టుపైకి పోయి భేతాళుని పట్టి బంధించి తీసుకొని వచ్చుచుండగా "మహారాజా! మరియొక కథ చెప్పుచున్నాను వినుము. ఉజ్జయినీ పురమునందు అగమస్వామియను బ్రాహ్మణుడు ఉండెను. అతనికి వేదపాలకుడను నొక కుమారుడును, సోమప్రభయను నొక కూతురును గలరు. సోమప్రభకు తండ్రి వివాహము చేయు తలంపుతో నున్న సమయమున జ్ఞాని, విజ్ఞాని, శూరుడు అను ముగ్గురు యువకులు వచ్చి ఆ కన్యనిమ్మని కోరిరి. తండ్రి ఆమెను

జ్ఞానికి యిచ్చుటకు అంగీకరించెను. కాని మిగిలిన యిద్దరు యువకులు అందుకు యిష్టపడక వివాదపడసాగిరి.



బ్రహ్మరాక్షసుని చంపి సోమప్రభను రక్షించిన శూరుడు

ఆ సమయమున నొక బ్రహ్మ రాక్షసుడు వచ్చి సోమప్రభ నెత్తుకొని పోయెను. అదిచూచి ఆమె తండ్రియు, సోదరుడు దుఃఖపడుచుండగా, జ్ఞాని యనువాడు ఆ రాక్షసుడు వెళ్ళిన మార్గమును, వాడు నివసించు స్థలమును చెప్పెను. విజ్ఞాని యనువాడు రథమును, విల్లు మొదలగువానిని సంపాదించెను. శూరుడు ఆ

రథమునెక్కి ధనుర్బాణములను తీసుకొని రాక్షసుని వెంటాడి, వానిని చంపి ఆ కన్యను రక్షించి, రథములో కూర్చుండబెట్టుకొని తెచ్చి తండ్రి కప్పగించెను. కనుక ఆ ముగ్గురిలో ఆ కన్యకు పురుషుడు కాదగినవాడెవ్వడు?" అని భేతాళుడు ప్రశ్నించగా, "శూరుడే ఆమెకు భర్తకాదగినవాడు కాని, మిగిలినవారు కార"ని విక్రమాదిత్యుడు చెప్పెను. అదివిని బేతాళుడు సంతోషించి, మరల పారిపోయి చెట్టుపై నిలచెను.

## భేతాళుడు చెప్పిన - శిరమును బట్టి భర్తను నిర్ణయించిన కథ

విక్రమాదిత్యుడు మరల చెట్టుమీదికిపోయి బేతాళుని పట్టి బంధించి తీసుకొని వచ్చుచుండగా, నతడు క్రింది కథ చెప్పెను-పూర్వము హేలావతియను పట్టణమును చంద్రుడను రాజు పాలించుచుండెను. అతనికి రూపవంతుడను నొక పుత్రుడు పుట్టినందుకు అనందించి, తన గ్రామదేవతకు గోపురప్రాకార మండపంబులు కట్టించి, మిక్కిలి వైభవముగా ఉత్సవము చేయించెను.

ఆయుత్సవము చూచుటకు దూరగ్రామముల నుండి కూడ వేలాది ప్రజలు వచ్చిరి. ఆ విధముగా వచ్చిన ఒక చాకలివాడు తన కులమునకు చెందిన ఒక పడుచునుచూచి మోహించి, గుడిలోనికిపోయి "ఆకన్య నాకు భార్యయగునట్లు చేసినయెడల నీకు నాతలను బలియిచ్చెద"నని దేవతను ప్రార్థించెను. తరువాత ఆ కన్యయొక్క తల్లిదండ్రుల వద్దకు వెళ్ళి తనకోరిక తెలుపగా, వారు ఆతనికి తమ కుమార్తెనిచ్చి వివాహము చేసిరి.

తరువాత ఆ చాకలివాడు తనభార్యను తీసుకొని సొంత గ్రామమునకు పోయి సుఖముగా ఉండెను. కొన్నిదినములు గడచిన తరువాత ఆ కన్యయొక్క తల్లిదండ్రులు తమ అల్లుని, కూతురును చూడదలచి, వారిని తీసుకొనిరమ్మని తమ కొడుకును పంపిరి. అతడు ఆగ్రామమునకుపోయి తన చెల్లెలిని, బావమరిదిని పిలుచుకొని వచ్చుచుండగా, దారిలోనున్న గ్రామదేవత గుడి కనబడినది. ఆ గుడిని చూచిన చాకలివానికి తనమ్రొక్కు సంగతి జ్ఞాపకమునకు వచ్చెను. అంతటవాడు గుడిలోనికిపోయి దేవతముందు నిలబడి తనచేతియందున్న ఖడ్గముతో శిరస్సును ఖండించుకొనెను. అదిచూచి వానిబావ దుఃఖము భరించలేక ఆ ఖడ్గముతోనే తన తలను కూడ ఖండించుకొనెను. వారిద్దరు అట్లు మరణించుట చూచి ఆ చాకలి యువతి దుఃఖము పట్టలేక నేనుమాత్రము బ్రతికి లాభమేమిటి అనితలచి, అచ్చట ఉన్నకత్తితో తనతలను ఖండించుకొన బోవుచుండగా, దేవత ఆమెకు ప్రత్యక్షమై "నీవు మరణించుటకు ప్రయత్నించవద్దు. నీభర్తకును, నీ సోదరునకు ప్రాణము నిచ్చెదను. వారి శిరస్సులను వారి మొండెములకు అతికించు"మని చెప్పగా, ఆ యువతి సంతోషము పట్టలేక తొందరపడి భర్తశిరస్సును అన్న మొండెమునకు, అన్నశిరస్సును భర్త మొండెమునకు తగిలించగానే ఎప్పటివలె వారు బ్రతికి పైకి లేచిరి. తరువాత ఆయువతి తానుచేసిన పొరపాటును గ్రహించి, వారిలో ఎవరిని తనభర్తగా ఎంచుకొనవలెనని ఆలోచనలో మునిగిపోయినది. కావున ఓ రాజ శేఖరా! ఆయిద్దరిలో నెవరినామె భర్తగా స్వీకరించదగు"నని యడిగెను.

అది విని విక్రమాదిత్యుడు "శరీరమునకంతకు శిరస్సు ప్రధానమైనది కావున మగని శిరస్సుగల శరీరముగలవాడే ఆమెకు భర్తయగు"నని చెప్పెను.

అదే న్యాయమైన నిర్ణయమని భేతాళుడు ఒప్పుకొని, మిక్కిలిసంతోషించి యెప్పటి వలె వృక్షముమీదికి పోయెను.

# బేతాళుడు చెప్పిన - కార్పాటకుని కథ

విక్రమాదిత్యుడు వెంటనే చెట్టుమీదికి పోయి భేతాళునిపట్టి బంధించి తెచ్చుచుండగా అతడు మరియొక కథనిట్లు చెప్పెను—

మల్లికాపురమను పట్టణమును శకటశృంగుడను రాజు పాలించుచుండెను. అతనికి కార్పాటకుడను మిత్రుడు వుండెను. అతడు ఎల్లవేళల రాజును కనిపెట్టుకొని తిరుగుచుండెను. ఒకనాడు రాజు తగుపరివారమును వెంటబెట్టుకొని వేటకుపోయెను. రాజువెంట కార్పాటకుడు కూడ వెళ్ళెను.

రాజు తనపరివారముతో అడవియందు ప్రవేశించి అనేక జంతువులను చంపి చాల అలసిపోయెను. దాహబాధ కలిగి చాల శ్రమపడసాగెను. అప్పుడు కార్పాటకుడు రెండు ఉసిరికపండ్లను తెచ్చి రాజుకు యిచ్చెను. రాజు ఆ పండ్లను తిని తనదప్పిక తీర్చుకొనెను. పిమ్మట తన పట్టణమునకు క్షేమముగా పోయెను.

తరువాత ఒకనాడు ఆరాజు కార్పాటకునితో మాట్లాడుచు, తనకు కళింగదేశపు రాజు కూతురును వివాహమాడవలెనను కోర్కెకలదని, నీవు వెళ్ళి ఆ కన్యను తనకిచ్చి వివాహము జరిపించునట్లు ఆ రాజును ఒప్పించి రమ్మని అడిగెను.

అంతట కార్పాటకుడు ఒక వర్తకుని యోడలోనెక్కి సముద్ర మార్గమున కళింగదేశమునకు పోవుచుండగా, నాయోడ తుఫాను ప్రమాదమునకు గురియై

.కగుట్టకు తగిలి బ్రద్దలై పోయెను. ఓడలోనున్న వారందరు నీటిలోమునిగి మర ుంచిరి. కాని కార్పాటకుడు మాత్రము నీటిలో మొలిచియున్న ఒక తీగను పట్టు ొని క్రిందికిపోగా కొంతదూరమున నాగలోకము కనబడినది. అతడచ్చటి కాంచన పురమను పట్టణము చేరెను.

అతడు ఆ పట్టణములో తిరుగుచు దుర్గాలయమును చూచెను. అతడు ఆ యాలయములోనికిపోయి దుర్గాదేవి ననేకవిధముల స్తుతించి, నమస్కరించెను. అప్పుడు ఆయాలయములోనికి అనేకమంది పురస్త్రీలువచ్చి దేవికి పూజానమస్కా రాదిక్రియలు జరిపించి పోవుచుండిరి. వారిలోనొక సుందరాంగి నూరుమంది దాసీ లతో ఆ యాలయమునకువచ్చి దుర్గను పూజించి కొంతసేపు నృత్యగానములుసలిపి పూజానమస్కారములు ఎంతో వైభవముగా జరుపుచుండెను.

ఆ సుందరాంగిని కార్పాటకుడు చూచి మోహించి, యొకదాసిని పరి చయము గావించుకొని, తన యభిప్రాయను తెలిపెను. ఆదాసి కార్పాటకుని యభి ప్రాయమును తన యజమానురాలికి తెలిపినంతట ఆమెయతనిని మోసగించదలచి దాసి చెవిలోనేమో రహస్యముగా చెప్పెను.

అంతనాదాసి కార్పాటకుని చెంతకువెళ్ళి "ఓ సుందరుడా! నీ యిష్ట ప్రకారము జరిపించెదను. ఈలోపుగా చెరువులో స్నానముచేసి రమ్ము" అని చెప్పెను. దాసి మాటలువిని కార్పాటకుడు ఎంతో ఆనందించి, వెంటనే ఆ చెరు వులో మునిగి స్నానముచేయుటకు సిద్ధపడెను. అతడు ఆ చెరువులో మునిగి పైకి లేచుసరికి తన స్వస్థలమగు మల్లికాపురమునగల చెరువులో నుండి బయటికి వచ్చెను. ఆ విషయము గ్రహించి అతడు ఎంతో ఆశ్చర్యమును, విచారమును

పొందెను. తరువాత రాజువద్దకుపోయి జరిగిన సంగతులన్నియు చెప్పెను. అతడు చెప్పిన సంగతులు రాజువిని మిక్కిలి ఆశ్చర్యపడి "నీవుమోహించిన ఆ స్త్రీని నేను చూడగోరుచున్నాను. నాకు ఆ ప్రాంతమును చూపుము" అని, రాజ్యపాలనను మంత్రికి అప్పగించి కార్పాటకునితో కలిసి ఓడపై బయలుదేరెను. కార్పాటకుడు రాజును తీగయున్న ప్రాంతమునకు వెళ్ళిన తరువాత ఓడనుండి దింపి, తీగను రాజుకు చూపించి దానిని పట్టుకొని నాగలోకమునగల దుర్గాలయమునకు పోయిరి. వారు గుడిలోనికిపోయి దేవిని స్తుతించి, పూజించి నమస్కరించుచున్న సమయమున ఆ సుందరాంగి తనదాసీలతో అచ్చటికి వచ్చెను. ఆమెనుచూచి ఇంత అందమైన స్త్రీని నేను ఎచ్చటను చూడలేదని కార్పాటకునితో చెప్పెను. ఆ రాజకుమారి రాజుయొక్క అందచందములు చూచి ముగ్ధురాలై అతనిని వివాహమాడదలచెను. రాజువద్దకు పోయి "ఓరాజా! నేనీ పట్టణమేలు రాజుకుమార్తెను. నా తండ్రి అభీష్టప్రదమను నొకగ్రామమున్ను, నిర్మాణకరమను నొకగ్రామమున్ను నాకు యిచ్చియున్నాడు. నేనాగ్రామములు నీకొసగెదను. నిన్ను నేను ప్రేమించుచున్నాను. కావున నన్ను వివాహమాడుము" అని కోరెను. అదివిని రాజు కార్పాటకుని చూపించి "ఇతడు నా ప్రియమిత్రుడు. నాకంటె అందమైనవాడు, సత్యము తప్పనివాడు కావున యితనిని వివాహమాడి సుఖింపు"మని చెప్పెను.

రాజు మాటలకు నాగకన్య అంగీకరించగా, రాజు ఆమె హస్తమును కార్పాటకుని చేతియందుంచి, అతనికి అప్పగించి, "నీవునాకు లోగడ యిచ్చిన ఉసిరికపండ్లలో నొకదానిఋణము తీరినది. మరియొక పండుయొక్క ఋణము తీరవలసియున్న"దని పలికి, తన పట్టణమునకు పోయెను. కనుక వారిద్దరిలో



రాజు కార్పాటకుని చేయిని నాగకన్య చేయితో కలపుట

నెవరుచేసిన ఉపకారము గొప్పది" అని భేతాళుడు ప్రశ్నించగా, "సేవకుడు రాజాజ్ఞ ననుసరించి చేయడము ధర్మమే కనుక కార్పాటకుడు చేసిన ఉపకారము అంత గొప్పది కాదు, రాజుచేసిన ఉపకారమే గొప్ప"దని విక్రమాదిత్యుడు చెప్పెను. అది విని భేతాళుడు ఆనందించి తిరిగిపారిపోయి చెట్టుమీద నిలచెను.

# భేతాళుని ప్రశ్న విని వరుని నిర్ణయించిన విక్రమాదిత్యుడు

విక్రమాదిత్యుడు వెంటనే చెట్టుపైకి పోయి భేతాళుని పట్టుకొని తెచ్చుచుండగా భేతాళుడు ఈక్రింది కథ చెప్పెను——

సింహాపురమను పట్టణమును వీరదేవుడనురాజు పాలించుచుండెను. అతనికి పద్మావతియను భార్యకలదు. ఆ రాజుకు చాలా కాలము వరకు సంతానము కలుగలేదు. అందుచేనతడు విచారగ్రస్తుడై యొక జ్యోతిష్కుని పిలిపించి తనకు సంతానప్రాప్తి కలదో లేదో తెలుపగోరెను. అది విని ఆ జ్యోతిష్కుడు రాజునొక యాగమున్నూ, తపమున్ను చేసిన సంతానము కలుగునని చెప్పెను.

అప్పుడా రాజు తన మంత్రికి రాజ్యపాలనా భారము అప్పగించి, జ్యోతిష్కుడు చెప్పిన ప్రకారము యాగము చేసెను. పిమ్మట అడవికి పోయి భక్తి శ్రద్ధలతో ఈశ్వరుని గూర్చి తపస్సు చేయనారంభించెను. కొంతకాలమైన తరువాత ఈశ్వరుడు ఆ రాజుకు ప్రత్యక్షమై "ఓ రాజా! నీ తపస్సుకు మెచ్చితిని నీకు త్వరలో సంతానప్రాప్తి కలుగగలదు. ఇక నీ పట్టణమునకు పొమ్ము" అని పలికి అదృశ్యమైనాడు. ఈశ్వరుని మాటలు విని రాజు పరమానంద మంది, తన రాజ్యమునకు పోయెను. జరిగిన సంగతులు భార్యకు చెప్పగా నామె ఎంతో ఆనందించి, ముందు కంటె ఎక్కువ భక్తి శ్రద్ధలతో ఈశ్వరుని పూజించుచుండెను.

కొన్ని దినములకు ఆ రాజునకు ఒక కుమారుడును, ఒక కుమార్తెయు కలిగిరి. వారు బాలచంద్రులవలె ప్రకాశించుచుండిరి. రాజు తన కుమారునకు సూర్యదేవుడని, కుమార్తెకు రత్నావతియని నామకరణములు గావించి మిగుల గారాబముతో పెంచుచుండెను.

రత్నావతి క్రమముగ పెరిగి పెద్దదయ్యెను. ఆమె సకల కళలలో మంచి నేర్పుకలిగి తల్లిదండ్రుల మెప్పు పొందుచుండెను. రాజు ఆమెకు తగిన వరుని చూచి వివాహము చేయదలచుచుండగా నొక రాజ కుమారుడు వచ్చి ఆమెను తనకిచ్చి వివాహము చేయుడని రాజు నడిగెను. రాజు అతనిని చూచి నా కుమార్తెను గొప్ప ధైర్య సాహసములు, విద్య గలవానికి మాత్రమే యివ్వ దలచితినిగాని అన్యునకివ్వ జాలనని తెలుపగా, నా రాజకుమారుడు నిరాశపడి తిరిగి వెళ్ళిపోయెను.

తర్వాత రాజు ఎంతకాలము నిరీక్షించినను, ఆతడనుకొన్న గుణము లన్నియు గల వరుడు లభించలేదు. అంతట రాజు తన కుమార్తెకు తగిన వరుడు లభించునో, లభించడో యని దిగులు పెట్టుకొని యుండగా, ఒకనాడు బ్రాహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రజాతులకు చెందిన నలుగురు అందమైన యువకులు వచ్చి రత్నావతిని తమకిచ్చి వివాహము చేయమని రాజును కోరిరి. రాజు ఏమి చేయుటకు తోచక మంత్రులను, పురోహితులను పిలిపించి, వీరిలో నెవనికి నా కుమార్తె నివ్వదగునో చెప్పుడని కోరగా, వారు ఏమియు చెప్పలేక మౌనముగా ఉండి పోయిరి. కాబట్టి ఆ చిన్న దానిని యెవరికియ్యవచ్చునో తెల్పుము" అని భేతాళుడు అడుగగా, "ఏ స్త్రీ నైనను అన్యకులస్థున కిచ్చుట అక్రమము. కనుక స్వకులస్థు

తయిన రాజకుమారునకు యిచ్చి వివాహము చేయుట యుక్తము" అని విక్రమా దిత్యుడు చెప్పెను. ఆ జవాబు విని భేతాళుడు ఆనందించి, తిరిగి చెట్టుపైకి పారి పోయెను.

# భేతాళుడు చెప్పిన - మదనసేన కథ

తిరిగి విక్రమాదిత్యుడు చెట్టుపైకిపోయి భేతాళుని బంధించి తీసుకొని వచ్చుచుండగా, మరియొక కథ చెప్పెను-

పూర్వము వీరదేవుడను రాజు మహాదేశమును పాలించెను. ఆ రాజుకు ధనదుడు అను కుమారుడును, మదన సేనయను కుమార్తెయు ఉండిరి. రాజు తన కుమార్తెయగు మదనసేనను సువర్ణుడు అను యువకునకిచ్చి వివాహం చేయుటకు వాగ్దానము చేసెను.

ఇట్లుండ సువర్ణుని ప్రాణస్నేహితుడగు ధర్మదత్తుడనువాడు మదన సేనను చాలకాలమునుండి ప్రేమించుచుండెను. అతడు మదనసేనను సువర్ణున కిచ్చుటకు రాజు వాగ్దానము చేసిన విషయము తెలిసికొని బెంగ పెట్టుకొని మంచము పట్టెను. అతని స్థితి చూచి సువర్ణుడు జాలిపడి "చెలికాడా! నీ విట్లుండుటకు కారణమేమిటి? నీకు కలిగిన వ్యాధి ఏది?" అని అడుగగా, మదనదత్తుడు తన విచారమునకు కారణము చెప్పుటకు సిగ్గుపడి, యుక్తిగా తన స్థితి నెరిగించెను. అతని యభిప్రాయము తెలిసికొని సువర్ణుడు యింటికి పోయెను. ధర్మదత్తుడు మోహమణచుకోలేక మరునాడు ఉదయమే రహస్యముగ మదనసేన వద్దకుపోయి, తన స్థితిని తెలియజేసెను. అతని అభిప్రాయము తెలిసికొని మదనసేన సిగ్గుపడి

స్త్రీలతో నిట్టి అనుచితమైన మాటలు చెప్పవచ్చునా ? తండ్రి అనుమతిని నాకు వివాహము కావలెను గాని, నా యిష్టప్రకారము కాదుగదా! అంతేగాక, నన్ను సువర్ణుడను యువకునకిచ్చి వివాహము చేయుటకు నా తండ్రి వాగ్దానము చేసిన సంగతి నీకు తెలిసియే ఉండును." అని చెప్పుచుండగా ధర్మదత్తుడు కామోద్రేకముతో యుక్తాయుక్తములు ఆలోచింపక ఆమె హస్తమును పట్టుకొనెను. అప్పుడు మదనసేన అతని స్థితిచూచి జాలిపడి, నాకు వివాహమైన పిమ్మట ముందుగా నీ యిష్టము నెరవేర్చెదను అని ప్రమాణము చేసి చెప్పగా, ధర్మదత్తుడంగీకరించి వెళ్ళిపోయెను.

తరువాత కొన్ని దినములకు రాజు మదనసేనను సువర్ణునకిచ్చి వివాహము జరిపించి, కూతురును, అల్లుని శయ్యాగృహమునకు పంపించెను. అప్పుడు మదనసేన భర్తనిచూచి ధర్మదత్తునకు తానుపూర్వమిచ్చిన వాగ్దానంసంగతి తెలిపి, అతనివద్దకు పోయివచ్చుటకు ఆజ్ఞయిమ్మని ప్రార్థించగా సువర్ణుడు చాల సంతోషపడి "నీవు యదార్థము చెప్పితివి. కావున వెళ్ళిరమ్మ" అని చెప్పెను.

అంతట మదనసేన ఆ యర్ధరాత్రి సమయమున చీకటిలో ఒంటరిగా బయలుదేరి ధర్మదత్తుని యింటికి పోవుచుండగా, సర్వాపహారియను నొక దొంగ ఆమె నడ్డగించి, ఆమె ధరించిన ఆభరణములనన్నింటిని తీసుకొనుటయేగాక, నీపై నాకు మోహము కలిగినది. కావున ఈ రాత్రి నన్ను సుఖపెట్టి పొమ్ము"అని కోరగా, ఆమె తాను పోవుచున్నపని యొక్క వివరము తెలిపి, తిరిగి వచ్చునపుడు నిన్ను కలసిన తర్వాత నాభర్త వద్దకు పోవుదు"నని వాగ్దానము చేసి, అతని వద్ద శలవు పొంది ధర్మదత్తుని వద్దకువెళ్ళి "నీకు మాటయిచ్చిన ప్రకారం వచ్చితిని కనుక నీ కోరిక తీర్చుకొనుము" అని చెప్పెను.

మదనసేన మాటలు విని ధర్మదత్తుడు ఆశ్చర్యపడి పరదానసంటుట మహాపాపమని భావించి, "నీవు పరదానవు. అందునను ప్రియమిత్రుని భార్యవు. నిన్ను కోరుట కంటె మహాపాపము మరియొకటిలేదు. వెంటనే నీ భర్తవద్దకు పోయి సుఖంగా నుండుము" అని పలికి పంపివేసినాడు.

అంతట మదనసేన యింటికి తిరిగివచ్చుచు చోరుని వద్దకు పోయి "నీ కోరిక తీర్చుకొనుము" అని చెప్పగా, ఆ దొంగ ఎంతో ఆశ్చర్యపడి ఇటువంటి సత్యవంతురాలు భూలోకమున నెచ్చటను లేదని మెచ్చుకొని, అట్టి ఉత్తమ స్త్రీని కోరుట మహాపాపమని భావించి, ఆమె నుండి అపహరించిన ఆభరణములనన్నిటిని యిచ్చివేసి "తల్లీ! నీ మంచి చెడ్డ లెరుగక, నిన్నుకోరి మహాపాపము మూటగట్టుకొంటిని. నా అపరాధం క్షమించి, యింటికిపోయి నీ భర్తతో సుఖంగ ఉండుము" అని పంపివేసెను.

అప్పటి నుండి మదనసేన తిన్నగా భర్తవద్దకు వచ్చి, జరిగిన వృత్తాంతమంతయు చెప్పగా సువర్ణుడు చాల సంతోషించి ఆమెతో కలిసి సుఖముగా ఉండెను. కావున ఓ విక్రమాదిత్య మహారాజా! సువర్ణుడు, ధర్మదత్తుడు సర్వాపహారిచోరియనుచోరుడు- ఈ ముగ్గురిలో నెవడు యోగ్యుడు" అని బేతాళుడు ప్రశ్నించగా "భార్య సిగ్గువిడిచి నిష్కళంకముగా భర్తతో చెప్పినందువల్ల సువర్ణుడు పంపుటకు అంగీకరించడం గొప్ప విషయం కాదు. మదనసేన పూర్వము చెప్పినమాట ననుసరించి సత్యము తప్పక ధర్మదత్తుని యొద్దకు పోయినందున ధర్మదత్తుడు బుద్ధిమంతుడు కనుక పరస్త్రీని ముట్టగూడదని తలచి పంపివేయడం కూడ గొప్ప విషయం కాదు. కాని సర్వదా జీవహింస చేయుచు

మృగమువలె సంచరించు మహాపాపియగు దొంగ ఆమెను విడిచిపెట్టుటయే గొప్ప విషయం. కనుక ఆ ముగ్గురిలో దొంగయే యోగ్యుడు" అని విక్రమాదిత్యుడు చెప్పగా, బేతాళుడు విని ఎంతో ఆనందించి మరల చెట్టుమీదికి పోయెను.

## భేతాళుడు చెప్పిన - సుకుమారి కథ

అంత విక్రమాదిత్యుడు తిరిగి భేతాళుని పట్టుకొని బంధించి తీసుకొని వచ్చుచుండగా క్రింది కథ చెప్పెను.

జయపురము అను పట్టణమును వైశంపాయనుడు అనురాజు పాలించు చుండెను. అతనికి చంద్రరేఖ, తామరవల్లి, మృగాంక యను ముగ్గురు భార్యలు కలరు. రాజు వారితో అన్యోన్యముగా ఉన్న సమయమున ఒక చిత్రము జరిగెను. అది యేమనగా, వసంతఋతువులో ఒకనాడు ఆ రాజు జ్యేష్ఠ భార్యయగు చంద్రరేఖతో కలసి విహరించుచున్న సమయమున ఒక తుమ్మెద వచ్చి ఆ స్త్రీ కొప్పులో ముడిచియున్న పుష్పదళముమీద వ్రాలగా నామె భయపడి మూర్ఛిల్లెను. చెలికత్తెలామెకు ఉపచారములు చేసి మెలుకువ కలిగించిరి.

మరునాడు రాజు రెండవభార్యయగు తామరవల్లితో వనములోనికిపోయి వెన్నెలలో విహరించుచుండగా ఆ వెన్నెల వేడిమికి ఆ స్త్రీ శరీరము పొక్కి బొబ్బలేర్పడెను. మూడవనాడు రాజు తృతీయ భార్యయగు మృగాంకతో కలిసి సౌధాగ్రమున నున్న సమయమున దూరప్రదేశమునందు వడ్లు దంచు శబ్దం వినగానే ఆమెయొక్క చేతులు బొబ్బలెక్కెను. రాజా! ఆ ముగ్గురు స్త్రీలలో సుకుమారి ఎవరు?" అని బేతాళుడు అడుగగా, "వడ్లు దంచిన శబ్దము వలన

హస్తములు పొక్కుటవలన పై ముగ్గురిలో మృగాంక మిక్కిలి సుకుమారి"యని విక్రమాదిత్యుడు చెప్పగా, బేతాళుడు ఆనందించి మరల చెట్టుమీదికి పోయి నిలచెను.

# భేతాళుడు చెప్పిన - ఎవరికీ పాపమంటుని కథ

అంతట విక్రమాదిత్యుడు మరల చెట్టుపైకి పోయి బేతాళుని బంధించి తీసుకొని వచ్చుచుండగా ఒక కథ నిట్లు చెప్పెను—

గంగాతీరములో వారణావతియను పట్టణము కలదు. అందు సకల విద్యా ప్రవీణుడైన బ్రాహ్మణుడు ఉండెను. అతనికి అర్జునస్వామి అను పుత్రుడు పుట్టెను. ఆ పుత్రుని కతడు పదునారేండ్లు నిండిన తరువాత ఉత్సాహవతి యను కన్యను వివాహం చేసెను.

ఒకనాడు అర్జునస్వామి భార్యతో కలసి వెన్నెలలో క్రీడించుచుండగా ఒక రాక్షసుడు వచ్చి అతని భార్యను ఎత్తుకొనిపోయెను. అప్పుడు అర్జున స్వామి తీవ్రమైన విచారమున మునిగి, తల్లిదండ్రులు మొదలగువారు ఎంత చెప్పి నను వినక, భార్యజాడ తెలుసుకొనవలెనని ఇల్లు వదలి, సకలదేశములు తిరిగి తుదకు వంగదేశమునకు పోయి పద్మనాభుడు అను బ్రాహ్మణుని దర్శించి భోజనము కావలెనని యడుగగా, నా బ్రాహ్మణుడు అంగీకరించి తన భార్యను పిలిచి ఆ బ్రాహ్మణునకు అన్నం పెట్టుమని చెప్పి ఏదో పనిపై బయటకు పోయెను.

అప్పుడు ఆ బ్రాహ్మణుని భార్య త్వరితంగా వంటచేసి అర్జున స్వామిని భోజనమునకు రమ్మని పిలువగా నతడు "అమ్మా! నేను ఇంకను సంధ్యా వందనం చేయలేదు. అన్నం యిచ్చిన ఏ చెఱువువద్దకైన పోయి, సంధ్యా వందనం చేసిన పిమ్మట భుజించెద"నని చెప్పెను.

అతని మాటలు విని, ఆ బ్రాహ్మణి మోదుగ ఆకు విస్తరలో అన్నం, కూరలు, నెయ్యి మున్నగునవి పెట్టి యివ్వగా అతడు దానిని తీసుకొని ఒక మడుగువద్దకుపోయి గట్టుపైనున్న చెట్టుక్రింద అన్నపుమూట నుంచి, మడుగులో స్నానంచేసి సంధ్యావందనాది క్రియలు జరుపుకొని, ఒడ్డుకువచ్చి మూటవిప్పిమరల చెరువులో దిగి మంచినీరు తెచ్చుకొనుటకు పోయెను.

ఆ సమయమున గరుత్మంతు డొక సర్పమును పట్టుకొనివచ్చి చెట్టు కొమ్మపై నుంచుకొని తినుచుండగా సర్పవిషం క్రిందనున్న అన్నంలో పడినది. అప్పుడు అర్జునస్వామి జలం దీసుకొని వచ్చి కూర్చుండి అన్నం తినగానే మర ణించెను. కనుక ఆ పాపం అన్నం యిచ్చిన బ్రాహ్మణ వనితకు చెందునా? లేక అన్నం పెట్టమన్న బ్రాహ్మణునకు చెందునా? లేక గరుత్మంతునికి చెందునా? లేక సర్పమునకు చెందునా?" అని బేతాళుడు ప్రశ్నించగా, అన్నం కావలసిన వాడు అన్నమడుగుట ధర్మం. భర్త ఆజ్ఞ ప్రకారం చేయుట భార్యకు ధర్మం. గరుడుడు పామును పట్టుట న్యాయం. ప్రాణావస్థలోనున్న పాము విషం క్రక్కుట సహజం. వీరిలో నెవరికయిన పాపం కలదని చెప్పెడివారికి పాపం కలుగును" అని విక్రమాదిత్యుడు చెప్పగా, బేతాళుడు విని మరల పారిపోయి చెట్టుపై నిలచెను.



## భేతాళుడు చెప్పిన - తీర్థవర్ధియను మంత్రి కథ

విక్రమాదిత్యుడు తిరిగి చెట్టుమీదికి పోయి బేతాళని పట్టి బంధించు చుండగా, బేతాళుడు ఈ కథను చెప్పెను.

పూర్వం విజయపురమను పట్టణమును వంశకేతుడను రాజు పాలించు చుండెను. అతని భార్య సత్యవ్రత సాటిలేని సౌందర్యవతి. రాజు భార్యనువిడిచి ఒక క్షణమైనను గడుపలేక, ఎల్లవేళల అంతఃపురముననే గడుపుచు రాజ్య

పాలనలో చాల అశ్రద్ధ వహించెను. ఆ రాజువద్ద తీర్థదర్శియను మంత్రి యుండెను. అతడు మంచి రాజభక్తి కలవాడగుటచే రాజుకు బదులు తానే రాజ్య వ్యవహారములను శ్రద్ధగా చూచుచు ప్రజలను రక్షించుచుండెను.

ప్రజలు అసలు విషయం తెలియక రాజు అసమర్థుడగుటచే మంత్రి రాజ్యం చేజిక్కించుకొని తమను పాలించుచున్నాడని మంత్రిపై లేనిపోని నిందలు వేయసాగిరి. మంత్రి తనపై కలిగిన అపవాదములకు బాధపడి రాజ్యమును వదలి పరదేశములకు పోయెను. అప్పుడు రాజు మరియొక మంత్రికి రాజ్య పాలన అప్పగించి ముందువలె భార్యతో అంతఃపురముననే గడుపసాగెను.

రాజ్యమును వదలివెళ్ళిన తీర్థదర్శి సకలదేశాలలో సంచరించి తుదకు సముద్రతీరానగల ఒక పట్టణం చేరి అచ్చట నొక వర్తకునితో స్నేహం చేసెను. వారు ఒకరినివిడిచి మరియొకరు ఒక క్షణమైన ఉండలేకుండిరి.

ఇట్లుండగా ఆ వర్తకుడు వ్యాపారార్థం విదేశమునకు ఓడనెక్కి పోవుటకు నిశ్చయించుకొని, ఆ సంగతి తీర్థదర్శికి చెప్పగా, నిన్ను విడిచి నే నిచ్చట ఒంటరిగా గడుపలేను. నన్ను కూడ నీ వెంట దీసుకొని పొమ్మని కోరగా, ఆ వర్తకుడు అంగీకరించి తీర్థదర్శినికూడ ఓడలో దీసుకొనిపోవుచుండగా సముద్ర మధ్యమందొక కాళికాలయమును, ఒక కొలనును, ఆ కొలనువద్ద నొక కన్యను చూచి, ఆశ్చర్యపడి "ఇంత అందమైన స్త్రీని ఎచ్చటను చూడలేదు. ఈమె ఎవ" రని వర్తకుని అడుగగా, "ఇచ్చటికి వచ్చినప్పుడు ఈ స్త్రీని చూచుచుందును. ఆమె ఎవరో నాకు తెలియదు" అని చెప్పెను.

పిమ్మట ఆ వర్తకుడు విదేశముచేరి తన సరకులను విక్రయించి విశేష ధనమార్జించి తిరిగి స్వస్థలమునకుచేరిరి. తరువాత తీర్థదర్శి వర్తకుని యొద్ద శలవుపుచ్చుకొని తన రాజ్యమునకుపోయి రాజును దర్శించెను. రాజు తన మంత్రి తిరిగి వచ్చినందుకు ఆనందించి ఆలింగనము చేసికొని ఎంతో గౌరవించి "ఇంత కాలము విదేశములలో గడుపుటకు కారణమేమి" అని అడుగగా, తీర్థదర్శి "మీరు రాజ్యపాలన విషయములలో తగినంత శ్రద్ధ తీసుకొనకపోవుట వలనను తనకు అపనిందలు కలుగుటవలనను దేశమువిడిచి పోయితిని" అని చెప్పెను. తరువాత అతడు తానుచూచిన దేశములలోని విశేషములను రాజుకు చెప్పునప్పుడు సముద్ర మధ్యముననున్న కాళికాలయమును గూర్చి, అచ్చట కనబడిన సుందరిని గూర్చి తెలిపెను. అట్టి అందమైన స్త్రీని నేను ప్రపంచములో ఎచ్చటను చూడలేదని చెప్పగా, రాజు ఆనందించి, స్త్రీలోలుడగుటచే ఆకన్యను చూచివచ్చెదను. అంత వరకు రాజ్యమును నీవు చూచుచుండవలసినదని ఆజ్ఞాపించి, వర్తకుని వివరములు తెలిసికొని అతనివద్దకు పోయి స్నేహముచేసెను. తరువాత ఆ వర్తకునితో కలిసి ఓడలో విదేశమునకు పోవుచుండగా, మార్గమధ్యమందున్న కాళికాలయము అచ్చటనున్న సుందరినిచూచి ముగ్ధుడై ఆలయములోనికి పోయి దేవికి ప్రదక్షిణ నమస్కారాదులు చేసి, "తల్లీ! నాకు ఈకన్యను దయచేయుము" అని ప్రార్థించి ఆ కన్యవద్దకు పోయి మాట్లాడబోగా ఆమె యతనినిచూచి నీటిలో దుమికెను. వెంటనే రాజు కూడ నీళ్ళలోదుమికి ఆమెవెంటపోయి "సుందరీ! నిన్నుకోరి వచ్చితిని. నన్ను నీభర్తగా అంగీకరించు"మని కోరెను.

అతడు మహారాజని ఆకన్య తెలుసుకొని "నేడు అష్టదినము కనుక మంచిదినం చూచి రమ్మ"నెను. తరువాత రాజు ఒక మంచిదినమునాడు ఆమె వద్దకుపోయి, సరససల్లాపములాడి సుఖముగా గడిపెను. ఇట్లు కొన్నిదినములు గడపిన తరువాత రాజు ఆమె మనస్సు కనిపెట్టవలెనని ఒక చెట్టుచాటున నక్కి-యుండగా, కన్య స్నానంచేయుటకు సరస్సుకు పోయెను. అప్పుడొక రాక్షసుడు వచ్చి ఆకన్యను మ్రింగెను. అదిచూచి రాజు వేగముగాపోయి తన ఖడ్గముతో నా రాక్షసుని ఖండించి వాని గర్భమందున్న కన్యను పైకితీసి రక్షించెను. అప్పుడు ఆకన్య రాజునుచూచి "ఓ మహారాజా! ఒక రహస్యమునుచెప్పుచున్నాను వినుము. నేను దేవలోకమునందు విద్యాధరవంశంలో మృగాంకదత్తుడనువాని కుమార్తెను. నాకు జ్యేష్ఠభ్రాతలు వేయిమంది గలరు. నేను నాతండ్రికి ఏకైక పుత్రికను. కనుక మిక్కిలిప్రేమతో పెంచుచుండెను. ఒకనాడు నావ్రతంపట్టి నా తండ్రికి కనబడ సందున తీవ్రవిచారమునకు లోనై ఉపవాసముండెను. తరువాత నేను ఇంటికి పోగానే నన్నుచూచి ఆకలి కోపంతో "నిన్ను రాక్షసుడు మ్రింగుగాక" అని శపించెను. అప్పుడు నేను తండ్రికి మ్రొక్కి "తండ్రీ! నాకీ శాపవిమోచనమెప్పుడగు" నని అడుగగా, జాలిపడి "భూలోకమున వంశదత్తుడను రాజు నీతో స్నేహముగ నుండి రాక్షసుడు నిన్ను మ్రింగుసమయమున వానిని చంపి, నిన్ను బ్రతికించు" నని చెప్పెను. అనగా ఆమె మాటలువిని రాజు ఎంతో సంతోషించెను. తరువాత వారిద్దరు అచ్చటినుండి విజయపురంనకు వచ్చిరి.

తిరిగివచ్చిన రాజును చూచి మంత్రులు, ప్రజలు మొదలగువారు ఎంతో ఆనందించి పండుగ చేసికొనిరి. రాజు ఆ సుందరాంగితో అంతఃపురమునకు పోయి సుఖంగా కాలం గడుపసాగెను. ముందువలెనే అతడు రాజ్యకార్యములను నిర్వహించక, పాలనాభారమంతయు మంత్రులపై వదలి సంతోషంగా ఉండెను. తీర్థదర్శియను మంత్రి రాజుయొక్క ప్రవర్తనలో మంచిమార్పు రానందుకు చింతించి విషముతిని మరణించెను. ఓ విక్రమాదిత్య మహారాజా! ఆమంత్రి రాజు రాజ్యమునకు తిరిగివచ్చెనని మరణించినాడా, లేక తాను చూచివచ్చిన కన్యను తెచ్చుకొని అంతఃపురమున సుఖించుచున్నాడను విచారముచేత మృతినొందినాడా?" అని భేతాళుడు అడుగగా "రాజుయొక్క గుణం తెలిసిఉండియు తీర్థదర్శి ఆ కన్యయొక్క అందచందాలను వర్ణించి చెప్పెను. పిల్లలకు తీపివస్తువులు పెట్టినట్లును, దుర్జనులకు హితవు చెప్పినట్లును, సహజకామియైనవానికి మరియొకసుందరి నంటగట్టితిని గదా యని పశ్చాత్తాపపడి విషంతిని చచ్చెను" అని విక్రమాదిత్యుడు చెప్పగా భేతాళుడు సంతోషించి మరల పైకివిగిరి చెట్టుపై నిలచెను.

## భేతాళుడు చెప్పిన - మణిమేఖల కథ

పట్టువిడువని విక్రమాదిత్యుడు మరల చెట్టుపైకిపోయి భేతాళునిబంధించి కొని వచ్చుచుండగా ఈ క్రింది కథ చెప్పెను—

పూర్వము మహాబలుడు అనురాజు ఉండెను. అతనికి మణిమేఖలయను కూతురు కలదు. రాజు ఆమెను సకలవిద్యలలో నారితేరిన యువకునకు యిచ్చి వివాహం చేయవలెనని నిశ్చయించుకొని యుండగా మణిమేఖలుడను యువకుడు సకల విద్యలలో ఆరితేరినవాడని తెలిసికొని యొక శుభముహూర్తమున అతనికి యిచ్చి వివాహం గావించెను. వారు అత్యంత ప్రేమానురాగములు కలిగి సుఖంగా కాలం గడుపుచుండిరి.



ఒకనాడు ఆ దంపతులు మంచంపై శయనించియున్న సమయమున ఆ మంచంక్రింద రెండు చీమల గుంపులు సంచరించుచుండెను. ముందుపోవుచున్న చీమలు ఉన్నట్టుండి నిలబడిపోయినవి. వెనుక వచ్చుచున్న చీమలు ఎందుకు నిలిచి పోయినారని యడిగినవి. మంచమడ్డు వచ్చుటచే నిలిచితిమని ముందు చీమలుచెప్పినవి. వెనుక వచ్చుచున్న చీమలు అట్లయినచో మంచము నెగురగొట్టి పోవుదము అని చెప్పినవి. అప్పుడు ముందున్న చీమలు భార్యాభర్తలు సుఖముగ నిద్రించుచుండగా అట్లుపోవుట పాపమని జంకి ఆగితిమి అని చెప్పినవి.

రాజుకు చీమల భాష తెలిసినందున వాటిమాటలు విని ఆశ్చర్యపడి ఫక్కుమని నవ్వెను. భర్త అట్లునవ్వుటకు కారణమేమో తెలియక మణిమేఖల "నాథా! మీరు ఎందుకు నవ్వినారు?" అని యడిగెను. దంపతులిద్దరు మాట్లాడు కొనుట విని చీమలు బిగ్గరగా "ఓ రాజా! మేము మాట్లాడుకొన్న మాటలు ఎవరి తోనైన చెప్పినయెడల తలపగిలి చత్తు"వని చీమలభాషలో చెప్పినవి.

ఆ మాటలు విని రాజు తీవ్రమైన విచారంలో మునిగి పోయెను. మణి మేఖల "నా ప్రశ్నకు బదులు చెప్పక మౌనము వహించితిరేమి? నాపై మీకు ప్రేమ లేదు కాబోలు! ఇట్టి దాంపత్యమెవరికి సుఖమగును? మీరు ఎందుకు నవ్వినారో నిజం చెప్పకున్న విషము త్రాగి ప్రాణము విడిచెద"నని కోపంగా చెప్పెను.

రాజు తన భార్యకు సంతోషం కలిగించవలెనను తలంపుతో, చితి నేర్పరచుకొని, దానిపై పరుండి, భార్యను చేరబిలిచి, చీమలు చెప్పుకొన్న మాటలు తెలుపబోయెను.

అప్పుడు అతనికి ఒక ఆడమేక, ఒక మగ మేక కనబడెను. పోతు పెంటితో కలువబోయెను. పెంటి అందుకు ఇష్టపడక నీకు నాపై ప్రేమ యున్నచో ఆ బావియందు వ్రేలాడుచున్న మెత్తని పచ్చికను తెచ్చియిమ్ము. పిమ్మట నిన్ను కలియుదును అని చెప్పెను. పోతు ఆ పెంటి మాటలు విని మిగుల వ్యథపొంది "ఓసీ, నీ ఆడుబుద్ధి చూపించితివి. నీకై నేనా పచ్చిక తెచ్చుటకు పోయి వంగినచో కాలుజారి నూతిలోపడి ప్రాణములు పోగొట్టుకొను తథ్యం. పిమ్మట నెవరితో చేరుదును? నీవు యెవరితో చేరుదువు? ప్రమాదము కలిగించు నీ స్నేహం ఉన్నను, లేకున్నను ఒక్కటే! తనకు మాలిన ధర్మం మొదలు చెడ్డ బేరం కనుక నీ దారిని నీవు పొమ్ము" అని కఠినంగా పలికెను.

చితిపై నున్న రాజు మృగ భాష తెలిసియున్న వాడగుటచే ఆ మేకల సంభాషణ విని, చితి నుండి గభాలున పైకి లేచి, పట్టణమునకు పోయి మరియొక కన్యను వివాహమాడి సుఖంగా ఉండెను. వింటివి గదా రాజా! ఇందెవరి బుద్ధి యెక్కువ" యని భేతాళుడు అడిగెను. అది విని విక్రమాదిత్యుడు "నోరు లేని జీవియైనను ఆ పోతుమేక ఆడుదాని మాటలకు లొంగిపోలేదు కావున నా పోతు యొక్క బుద్ధియే యెక్కువ" అని చెప్పగా, బేతాళుడు అంగీకరించి మరల చెట్టు మీదికి పారిపోయెను.

# భేతాళుడు చెప్పిన - మంత్రము నేర్చుటకు అర్హుడుకాని బ్రాహ్మణుని కథ

విక్రమాదిత్యుడు మరల బేతాళని బంధించి తీసుకొని పోవుచుండగా అతడు మరియొక కథనిట్లు చెప్పసాగెను.

పూర్వం ధర్మపురి అను పట్టణము నందొక పాడుబడిన దేవాలయం ఉండెను. దానియందొక బ్రాహ్మణుడు ఆకలి బాధకు ఆగలేక పండుకొని యుండెను. అతనిని ఒక యోగిచూచి, జాలిపడి, అతని ఆకలిబాధ తొలగించవలెనని తలచి, తన మంత్రమహిమచే ఒక పట్టణమును సృష్టించి ఆ పట్టణములో నొక గృహమును భక్ష్యభోజ్యాదులతో నిండియుండునట్లు చేసెను. తరువాత ఆ బ్రాహ్మణుని ఆ గృహమునకు పిలుచుకొని పోయి అతని యాకలిబాధ తీర్చెను. బ్రాహ్మణుడు మిక్కుటంగ భుజించి ఆయాసం తీర్చుకొనుచుండెను.

ఆ బ్రాహ్మణునకు మంత్రోపదేశం చేయవలెనని ఆ యోగి భావించి, అతనిని స్నానంచేసి రమ్మని చెప్పెను. యోగి చెప్పినట్లు ఆ బ్రాహ్మణుడు సమీపంనను న్న కొలనుకు పోయి యందు మునిగెను. అతడట్లు మునుగుసరికి అతనికొక కలవచ్చెను. తన కుమారుడు వచ్చి యెదుట నిలబడినట్లు కలగనెను. కండ్లు విప్పిచూడగా ఎవరుగు కనబడలేదు. ఆ విషయం నతడు యోగికి తెలిపెను.

అది విని ఆ యోగీంద్రుడు నేను నీ విషయంలో వ్యర్థంగ ప్రయాస పడితిని. నే నిప్పుడు ఉపదేశింపబోవు మంత్రం నీకు ఫలింపదు కనుక నీదారిననీవుపొమ్ము." అనిచెప్పి పంపివేసెను. ఆ బ్రాహ్మణుడు విచారించుచు వచ్చిన దారిని పోయెను. ఓ వి క్ర మా ది త్య మహారాజా! యోగికి ఫలించిన మంత్రం ఆ బ్రాహ్మణునకు ఫలింపకుండుటకు కారణమేమి" అని ప్రశ్నింపగా "వ్రతం, శ్రద్ధ, దానం, మంత్రం, జపము మొదలగువానికి ఏకాగ్ర చిత్త మావశ్యకము. ఆ బ్రాహ్మణుడు ఏకాగ్రమనస్కుడుకానందున యోగి అతనికి మంత్రం ఉపదేశించుటకు ఇష్టపడలేదు" అని విక్రమాదిత్యుడు చెప్పెను. అదివిని బేతాళుడు మరల చెట్టుమీదికి పోయెను.

## భేతాళుడు చెప్పిన-వైశ్యపుత్రుని కథ

విక్రమాదిత్యుడు మరల భేతాళుని బంధించి తీసికొని పోవుచుండగా, అతడు ఒక కథ నిట్లుచెప్పెను.

రామనగరమను పట్టణమున ఒక వర్తకుడు ఉండెను. అతనికొక కుమార్తెగలదు. ఆమె అవివాహితురాలుగా ఉన్నప్పుడు ఒక బ్రాహ్మణుని ప్రేమించి అతనితో రహస్యంగా సుఖించుచుండెను.

ఇట్లు జరుగుచుండగా ప్రక్క యూరినుండి ఒక వైశ్య యువకుడు ఆ వర్తకుని వద్దకువచ్చి అతని కుమార్తెను తనకుయిచ్చి వివాహము చేయమనికోరెను

ఆ వర్తకుడు అతడు తన కుమార్తెకు తగిన వరుడని నిశ్చయించుకొని ఒక శుభ ముహూర్తమున కూతురునిచ్చి పెండ్లిచేసెను. తరువాత అల్లునితో కుమార్తెను అత్తవారింటికి పంపెను.

ఆ వైశ్యయువతి తన ప్రియుడగు బ్రాహ్మణుని వదలివుండలేక మనో వ్యాధితో మంచమెక్కి తుదకు మరణించెను. తన ప్రియురాలు మరణించినదను సంగతి తెలిసి ఆ బ్రాహ్మణుడు దుఃఖము భరించలేక ఆత్మహత్య చేసికొనెను. భార్యపై మిక్కిల అనురాగముగల వైశ్యయువకుడు ఆమెలేని జీవితమెందుకని, ఆమె వియోగము భరించలేక ప్రాణమువిడిచెను. రాజా! ఆ ముగ్గురిలో నెవరధికులో చెప్పుమని భేతాళుడు అడుగగా "వర్తకుని కూతురును బ్రాహ్మణుడును మరణించినది గొప్పవిషయంకాదు. వారుభయులు ప్రేమించుకొని కొంతకాలము సుఖించిరి. ఏమియుఎరుగని వైశ్యపుత్రుడు ఆమె మరణించినందుకు బాధపడి ప్రాణము విడుచుట గొప్పవిషయము కావున అతడే శ్రేష్టుడు" అని విక్రమాదిత్యుడు చెప్పగా భేతాళుడు సంతోషించి ఎగిరి చెట్టుమీదికి పోయెను.

## భేతాళుడు చెప్పిన - పులిని బ్రతికించిన బ్రాహ్మణ యువకుల కథ

విక్రమాదిత్యుడు మరల చెట్టుపైకి పోయి భేతాళునిపట్టి బంధించి తీసుకొని వచ్చుచుండగా ఈ కథ చెప్పెను.

ధర్మవరమను గ్రామములో విష్ణుశర్మ యనునొక బ్రాహ్మణుడు ఉండెను. అతనికి నలుగురు పుత్రులుపుట్టిరి. వారు యుక్తవయస్కులై సంతట దేశాటనమునకు పోయిరి.

అట్లువెళ్ళిన ఆ బ్రాహ్మణయువకులు ఒక యోగీశ్వరుని దర్శించి భక్తి శ్రద్ధలతో సేవలుచేసిరి. వారి సేవలకుమెచ్చి ఆ యోగీంద్రుడు మృతసంజీవిని మొదలగు మంత్రములు నుపదేశించెను.



బ్రాహ్మణ యువకులను చంపి తినుచున్న పులి

కొన్ని దినములైన తరువాత వారు యోగీశ్వరునివద్ద శలవు తీసుకొని స్వస్థలమునకు బయలుదేరిరి. దారిలో వారికి చచ్చి పడియున్న ఒక పులి కనబడినది. దాని శరీరము శిథిలమై అస్థిమాత్రాన శిష్టముగా పడియున్నది. వారిలో ఒకడు దగ్గరకుపోయి దాని ఎముకలనన్నిటిని సరిచేసెను. రెండవవాడు దానికి నరములు కల్పించెను. మూడవవాడు చర్మం, రక్తము మొదలగువానిని కల్పించెను. నాలుదవవాడు మృతసంజీవిని మంత్రమును పఠించగా తక్షణమే ఆ పులికి ప్రాణం కలిగి పైకిలేచి నిలబడినది. అది భరించలేనంత ఆకలికలిగి ఆ నలుగురు బ్రాహ్మణయువకులపై పడి చంపి భక్షించినది. ఈ దోషమెవరికి చెందును?" అని భేతాళుడు ప్రశ్నించగా "తాము బ్రతికింపబోవుచున్నది దుష్టమృగము అని తెలిసి యుండియు దానిని బ్రతికించినవారికే ఆ దోషము చెందునని విక్రమాదిత్యుడు చెప్పెను." అది విని బేతాళుడు సంతోషించి రివ్వుమని ఎగిరి చెట్టుపైకిపోయి నిలబడెను.

భట్టి - విక్రమాదిత్యుల కథలు మొదటిభాగము సంపూర్ణము



బాలలూ :

"భట్టి-విక్రమాదిత్యుల కథలు" రెండవ భాగములో మరెన్నో చిత్ర విచిత్రమైన కథలుకలవు. కావున వాటినికూడా చదివి ఆనందించుడు.

బొమ్మల

# భట్టి-విక్రమాదిత్యుల

# కథలు

(రెండవ భాగము)

రేవళ్ళ సూర్యనారాయణ మూర్తి

నవరత్న బుక్ సెంటర్
ఏలూరు రోడ్, * విజయవాడ-520002

# ఒక మాట!

బాలలూ!

భారతదేశము మహావీరులకు పుట్టినిల్లు. శ్రీరాముడు, పరశురాముడు, శ్రీకృష్ణుడు, భీష్ముడు, కర్ణుడు, అర్జునుడు, పురుషోత్తముడు మొదలగు అనేక మంది మహావీరులను కన్న వీరమాత మన భారతమాత.

ఆ విధముగా భారతభూమిలో జన్మించిన వీరులలో విక్రమాదిత్యుడు ఒకడు. విక్రమాదిత్యుడు మొదట చంద్రగుప్తుడు అను పేరుతో రాజ్యపాలన చేయుచుండెడివాడని, అతడు అసమాన బలపరాక్రమములు చూపి, అనేకమంది రాజులను, రాజ్యములను జయించి "విక్రమాదిత్యుడు" అను బిరుదు పొందినాడని చరిత్రకారులు వ్రాసిరి.

ఏది ఎట్లున్నను విక్రమాదిత్యుడు అసమాన బలపరాక్రమములు కలవాడని, ధర్మము తప్పక ప్రజలను పాలించిన రారాజని ప్రసిద్ధిపొందినాడు. శక పురుషునిగా గుర్తింపబడుచున్నాడు. ఆయన ధైర్యసాహసములను, వీరత్వమును, న్యాయబుద్ధిని తెలుపు కథలు,గాధలు అనేకము మన దేశములో ప్రచారమందున్నవి ఆ కథలు వినోదము, విజ్ఞానము, ఆశ్చర్యానందములు కలిగించుచు ఆబాల వృద్ధులను అలరింపజేయుచున్నవి. అట్టి కథలలో కొన్ని ముఖ్యమయిన కథలను ఈ పుస్తకములో వ్రాసితిని.

నా ఈ రచనను "నవరత్న బుక్ సెంటర్" (విజయవాడ) వారు స్వీకరించి, ఆ యా కథలకు సంబంధించిన చక్కని చిత్రపటములు అనేకము చేర్చి, అందమయిన ముఖచిత్రముతో ముచ్చటగా ప్రచురించి మీకు అందజేసినందుకు వారికి నా ధన్యవాదములు తెల్పుచున్నాను.

—రేవళ్ళ సూర్యనారాయణమూర్తి.

# మా స్వంత ప్రచురణలు

బొమ్మల శ్రీ షిర్డీసాయి జీవిత చరిత్ర
" అక్బర్ బీర్బల్ వినోద కథలు
" తెనాలి రామకృష్ణుని సంపూర్ణ హాస్య కథలు
" ఆలీబాబా 40 దొంగలు
" అల్లావుద్దీన్ అద్భుతదీపం
" గలివర్ సాహస యాత్రలు
" శ్రీ శ్రీ శ్రీ మర్యాదరామన్న కథలు
" భట్టి విక్రమార్కుని సాహస కథలు (2 భాగాలు)
" భేతాళ కథలు
మొగల్ సామ్రాజ్య కథానాయకులు
" ప్రవక్త మహమ్మద్
" ఏసుక్రీస్తు కథలు
" మదర్ థెరిసా
" రవీంద్రనాధ్ ఠాకూర్
" యోగివేమన
" భగత్ సింగ్
" అంబేద్కర్
" యశపాల్ కపూర్
" భగవతీచరణ్
" సుభాష్ చంద్రబోస్
" చంద్రశేఖర ఆజాద్
" జయప్రకాష్ నారాయణ్
" సంఘసంస్కర్త రాజా రామమోహనరాయ్
" పూజ్యబాపూజీ

# భట్టీ-విక్రమాదిత్యుల కథలు
## [రెండవ భాగము]

### భేతాళుడు చెప్పిన - రత్నావతి కథ

విక్రమాదిత్యుడు మరల చెట్టుపైకిపోయి భేతాళుని పట్టి బంధించి తీసుకొని వెళ్ళుచుండగా అతడు ఈ క్రింది కథను చెప్పెను-

అయోధ్యానగరంలో వీరకేశుడను వర్తకుడు ఉండెను. అతనికి రత్నావతియను కూతురుకలదు. ఆమె చాలా అందమైనది. అందంనకుతోడు విద్యా వినయములు కలిగియొప్పుచు ఎల్లరిమెప్పు పొందుచుండెను. ఆమె అందచందములను చూచిన ప్రతియువకుడు ఆమెను వివాహమాడ దలచుచుండెను.

ఇట్లుండ ఒక దినమున ఇద్దరు యువకులు వీరకేశుని యింటికి వచ్చి రత్నావతిని తమకిచ్చి వివాహంచేయమని వేడుకొనిరి. ఆ సంగతి నెరిగిన రత్నావతి తలిదండ్రులతో నేనెవరినీ పెండ్లిచేసుకొననని చెప్పినది. కూతురుపైగల ప్రేమాను

రాగములవలన ఆమెను బలవంతం చేయుటకు ఇష్టపడక తల్లిదండ్రులు ఆమెను కోరిన యువకులకు ఆమెనిచ్చి వివాహం చేయజాలమని చెప్పి పంపివేసిరి. ఆమె తండ్రియింటనే సుఖంగా పెరుగసాగినది.

ఇట్లు జరుగుచుండగా ఆ పట్టణంలో విపరీతంగా దొంగతనములుజరుగ సాగినవి. దొంగలు చెలరేగి యిండ్లకు కన్నములుపెట్టుచు దొరికిన వస్తువులను చేజిక్కించుకొని పారిపోవుచుండిరి. దిన దినాభివృద్ధియగుచున్న దొంగలబాధ పడ లేక ప్రజలందరూ రాజు వద్దకుపోయి మొరపెట్టుకొనిరి. రాజు వారి బాధలు విని జాలిపడి దొంగలను పట్టుకొనుటకు కొందరు అధికారులను నియమించెను. కాని వారివలన ఉపయోగం లేకపోయినది.

అంతట రాజు తానే స్వయంగా దొంగలను పట్టుటకు నిశ్చయించుకొని మారువేషం ధరించి ఆయుధంచేపట్టి వీధులలో తిరుగుచుండెను. అది అర్ధరాత్రి సమయం చీకటి దట్టంగాఉన్నది. ముందు వెనుకలకు ఎటుచూచినను చీకటి తప్ప మరేమియు కనబడుటలేదు.

అట్టిసమయంన నొక భయంకరాకారము గల వ్యక్తివచ్చి రాజుముందు నిలచెను. రాజు ఏమాత్రం భయపడక "ఎవరు నువ్వు?" అని అడిగెను. అది విని ఆ భయంకరాకారుడు "మహారాజా! నేనీ గ్రామదేవతయగు మహాకాళి కొడుకును పోతురాజను పేరు గలవాడను"అని బొంకెను. రాజు వాని మాట లునమ్మక వాడు దొంగల రాజని గ్రహించి, ఏమియు యెరుగని వానివలెనటించుచు "ఓహో! పోతు రాజుగారా! మా గ్రామదేవత పుత్రులగు మిమ్ము దర్శించినందుకు నేనెంతో ఆనం దించుచున్నాను. మీరుకూడ మాకు పూజ్యులే! కావున మీరు నాకొక ఉపకారం

చేయవలెను. కాళీమాతమా గ్రామంను కాపాడుచున్నట్లు మీరుకూడ మాగ్రామంను రక్షింపవలెను. తాము నా కోరికను త్రోసిపుచ్చక మమ్ము కాపాడునట్లు వరమిండు" అని వినయంగాపలికెను.

దొంగలరాజు ఆ మాటలువిని ఆనందించి ఇతడు నన్ను పోతురాజని నమ్ముచున్నాడు. అట్టి నమ్మకమిపుడు పాడుచేయకూడదు. ఏదో సమయం చూచి ఈ రాజును చంపి రాజ్యమాక్రమించుకొనవలెనని నిశ్చయించుకొని "రాజా! మీరడిగిన వరమొసగితిని. ఇక నగరికి రండని ముందుకునడిచెను. దొంగ ముందును రాజు వెనకను నడిచి నగర మొగసాలవద్దకు పోయిరి. తరువాత రాజు దొంగను చూచి బయటభద్రంగా చూచుచుండుమని పలికి లోనికిపోయెను. వెంటనే దొంగల నాయకుడు తన సహచరులనుపిలిచి తన అభిప్రాయము తెల్పెను. అతడు ఎట్లు చెప్పిన అట్లుచేయుటకు చోరులందరూ సిద్ధంగాఉండిరి. ద్వారపాలకులు దొంగల కపటచర్యలను గ్రహించి రాజుకు తెలియజేసిరి.

అంతట రాజు తగుసైన్యంతో వచ్చి దొంగల గుంపును ముట్టడించి అందరిని పట్టుకొనెను. దొంగల నాయకునకు రాజు శిరచ్ఛేదం చేయమని ఆజ్ఞ యిచ్చెను. రాజాజ్ఞననుసరించి భటులు అదేప్రకారం దొంగను ముస్తాబుచేసి వీధుల వెంట తీసుకొని పోవుచుండిరి. అప్పుడు రత్నావతి ఆ దొంగల నాయకుని చూచి మోహించినది. వెంటనే తల్లిదండ్రులను పిలిచి రాజభటులు తీసికొని పోవుచున్న చోరనాయకుని చూపించి "అతడే నాకు తగినభర్త. ఏ విధముగనైనను అతనిని విడిపించి తెచ్చి నాకు వివాహంచేయుడు. లేకున్న నేను ప్రాణములు విడచెదను" అని చెప్పెను.

కూతురు మాటలువిని తలిదండ్రులు తెల్లబోయిరి. "ఇట్టి విపరీతమైన కోరిక ఎవరయినా కోరుదురా? రాజుచే శిక్షింపబడి కొద్దిసేపటిలో ప్రాణములు పోగొట్టుకొనను్న వానిని మోహించి పెండ్లాడగోరుచున్నావేమి? నీకేమైన పిచ్చి పట్టినదా? అట్టిచోరుని పెండ్లాడిన లోకులు నిన్నును నన్నునుకూడ చోరులమని భావించి చులకనగా చూడరా? ఇట్టి తెలివితక్కువ కోరిక విడిచిపెట్టుము" అని ఎంతో నచ్చజెప్పిరి. వారు ఎంత నచ్చచెప్పినను రత్నావతి మనస్సు మార్చుకొనక అతనినే పెండ్లిచేయమని, లేకున్న మరణించెదనని చెప్పెను.

అంతట తండ్రి కూతురుపైగల ప్రేమచే వెలగల రత్నములను తీసుకొని రాజువద్దకు వెళ్ళి పాదముల వద్దపెట్టి "మహారాజా! మీరు శిరచ్ఛేదం చేయుటకు ఆజ్ఞనిచ్చిన దొంగను నా పుత్రిక గుడ్డిగా ప్రేమించినది. అతనిని తనకు పెండ్లిచేయకున్న ప్రాణత్యాగం చేయుటకు నిశ్చయించుకొన్నది. ఆమెలేకున్న మేము జీవించలేం. మమ్ము ఈ ఆపదనుండి రక్షింపుడు" అని దీనంగా వేడుకొనెను. వీరకేశుడు ఎంత వేడుకొన్నను రాజు ఆ దొంగను విడుచుటకు అంగీకరించక "శెట్టి! నీవుకూడ దొంగవైయుందువు. కాకున్న వానిని విడిపించుటకు ప్రయత్నింపవు. వాడు దొంగతనంచేసిన వస్తువులనుతెచ్చి నీకు చౌకగా అమ్ముచుండును కాబోలు. అందువలననే కూతురువంకపెట్టి వానిని తప్పించుటకు ప్రయత్నించుచున్నావు. నీ దొంగవేషములు నేను కనిపెట్టలేననుకొంటివా? తక్షణమే యిచ్చటినుండి వెళ్ళి పొమ్ము లేకున్న నీకుకూడ వాడికి పట్టినగతియే పట్టగల"దని కఠినంగా చెప్పెను.

అంతట వీరకేశుడు చేయునదిలేక విచారంగా ఇంటికిపోయి రత్నావతిని పిలిచి ఆ సంగతిచెప్పెను. అదివిని రత్నావతిదుఃఖముపట్టలేక క్రిందపడి మూర్ఛపో

యెను. ఆమె స్థితిచూచి తలిదండ్రులుబిగ్గరగాఏడ్చుచు శైత్యోపచారములు చేయసాగిరి. కొంతసేపటికి రత్నావతి మూర్ఛనుండి తేరుకొని పైకిలేచి రొమ్ము బాదుకొనుచూ దొంగవెంటపడి పరుగెత్తసాగెను. ఆమె చర్యలను చూచినప్రజలు ఆమెకు పిచ్చి పట్టినదని భావించి నవ్వసాగిరి. తల్లిదండ్రులు ఆమె పడుచున్న అవస్థచూచి —వెన్నంటి పోవుచుండిరి.

ఈ లోపుగా రాజభటులు దొంగను శ్మశానమునకు ఈడ్చుకొనిపోయి కొఱ్ఱునకు ప్రదక్షిణం చేయించి కొఱత వేసిరి. దొంగ ఆ రాజభటులను చూచి మొదట నవ్వి, తరువాత ఏడ్చి ప్రాణం విడిచెను. దొంగ ప్రాణము విడిచిన సంగతి గమనించి, రత్నావతి చితిపేర్చుకొని, నిప్పంటించి అందు దుముకబోవు చుండెను.

అదే సమయమున అటు పోవుచున్న పార్వతీ పరమేశ్వరులు రత్నావతిని చూచి జాలిపడి, ఆమెకు ప్రత్యక్షమై "నీకేమి కావలెనో కోరుకొను"మని పలుకగా, ఆమె పార్వతీ పరమేశ్వరులకు ప్రదక్షిణ నమస్కారాదులు చేసి "జగద్రక్షకులారా! మీకు నాయందు దయయున్నచో నా మనోహరుడగు దొంగను బ్రతికింపుడు. నే నాతనిని పతిగ భావించితిని. నాకు పతిభిక్ష పెట్టుడు" అని కోరెను.

పార్వతీ పరమేశ్వరులు ఆమె దృఢ సంకల్పమునకు, పతిభక్తికి ఆనందించి, ఆమె కోరిన విధముగ చోరనాయకుని బ్రతికించిరి. వాడు నిద్రపోయి లేచినట్లు పైకిలేచి జరిగిన సంగతులు తెలుసుకొని ఆనందాశ్చర్యములు పొందెను.

పార్వతీ పరమేశ్వరులు అంతర్ధానమైనంతట రత్నావతి తల్లిదండ్రులు కూతురును, చోరనాయకుని ఇంటికి దీసుకొనిపోయి ఎంతో వైభవముగా పెండ్లిచేసిరి.



పార్వతీ పరమేశ్వరులు రత్నావతికి ప్రత్యక్షమై దొంగను బ్రతికించుట

జరిగిన సంగతులన్నియు విని రాజు ఆశ్చర్యపడి, చోరనాయకుని పిలిపించి, తన సైన్యమునకు అధికారిగ జేసెను. "విక్రమాదిత్య మహారాజా! ఆ దొంగ చనిపోవుటకు ముందు నవ్వి తరువాత ఏడ్చుటకు కారణమేమిటి?" అని

భేతాళుడు అడుగగా, "రత్నావతి తన మంచి చెడ్డలు విచారించక దొంగనని ఎరిగి వుండి ఎట్లు ప్రేమించినదా అనుకొని నవ్వినాడు. ఆమె తల్లిదండ్రులు కూతురుపై గల ప్రేమచే గోడుగోడున ఏడ్చుటను చూచి మనసు కరగి ఏడ్చినాడు" అని విక్రమాదిత్యుడు చెప్పిన తక్షణం భేతాళుడు కట్లు త్రెంచుకొని చెట్టుమీదికి పోయినాడు.

# భేతాళుడు చెప్పిన - భాగ్యవతి కథ

అంతట విక్రమాదిత్యుడు విసుగుచెందక మరల చెట్టుమీదికి పోయి, భేతాళుని పట్టి బంధించి వీపుపై నుంచుకొని తెచ్చుచుండగా ఈ కథ చెప్పెను—

పూర్వము గోపాల పట్టణమును కార్తికేయుడను రాజు పాలించెను. అతడు ధర్మము తప్పక ప్రజలను పాలించి మంచిపేరు పొందెను. ఆ రాజేంద్రునకు భాగ్యవతి యను కూతురు కలదు. ఆమె అప్సరసలను మించిన అందచందములు కలిగి అలరారుచుండెను. ఆమె లలిత కళలలో ఆరితేరిన మహిళ. ఆమె ఒకనాడు అంతఃపురాగ్రమున ఇటునటు తిరుగుచుండగా శివస్వామియను నొక బ్రాహ్మణ యువకుడు చూచి ముగ్ధుడై ఆమెను మోహించెను. భాగ్యవతి కూడ ఆ యువకుని చూచి అతని అందచందముల కలరి వలచెను. ఇరువురు ఒకరినొకరు చూచిన తక్షణం పరస్పరం ప్రేమ దృక్కుల బరపుకొనిరి. ఒకరినొకరు కలసి కొనుటకు తహతహలాడసాగిరి. కాని అంతఃపురమున ఉండు భాగ్యవతి ఎక్కడ? సామాన్య బ్రాహ్మణ యువకుడైన శివస్వామి యెక్కడ? ఎంత ఆలోచించినను భాగ్యవతికి అతడిని కలుసుకొను మార్గం కనబడలేదు

శివస్వామి భాగ్యవతిని కలుసుకొనుటకు తగు మార్గం కనబడక, ఆమెపై కలిగిన మోహమును విడువలేక చింతాక్రాంతుడై తుదకు పట్టణమును వదలి యొక అడవికి పోయెను.

అచ్చట నొక గుహలో నివసించుచున్న యోగిని దర్శించి, తన వృత్తాంతము నంతయు తెలియజేసి, తన ప్రేయసియగు భాగ్యవతిని కలిసికొనుటకు తగు మార్గం చెప్పమని ప్రాధేయపడెను. యోగి ఆ బ్రాహ్మణ యువకుని స్థితి చూసి జాలిపడి వారిద్దరు కలిసికొనుటకు తగు మార్గములేవైన కలవా అని ఆలోచించి, ఏ మార్గం కనపడనందున తుదకు ఒక ఉపాయమాలోచించెను. ఆ బ్రాహ్మణ యువకునకు స్త్రీ వేషము వేసి తన వెంటబెట్టుకొని రాజు వద్దకు పోయెను.

తన దర్శనమునకు వచ్చిన యోగిని మహారాజు గౌరవించి, నావలన మీకు కావలసిన పనియేదయిన నున్నచో తెలుపుడు. తప్పక చేసెదననగా, యోగి "మహారాజా! నేను కాశీయాత్ర కేగుచున్నాను. నా పుత్రిక నంతదూరం దీసుకొని పోవుట నా కిష్టంలేదు. నేను తిరిగి వచ్చునంతవరకు దీనిని మీ యంతఃపురమున వుంచి కాపాడుడు" అని కోరెను. అందుకు రాజు అంగీకరించి స్త్రీ వేషమున వున్న శివస్వామిని అంతఃపురమునకు పంపెను. పిమ్మట ఆ యోగి రాజును ఆశీర్వదించి వచ్చిన దారిన తిరిగిపోయెను. శివస్వామి స్త్రీ వేషముతో భాగ్యవతి చెలికత్తెలతో కలసి మెలసి తిరుగసాగెను. నాలుగయిదు దినములట్లు గడపి ఒక నాటిరాత్రి శివస్వామి రాజపుత్రిక పడకగదిలో ప్రవేశించి, ఆమెకు తన నిజరూపం చూపించి, జరిగిన విషయము లన్నియు చెప్పెను.



సిద్ధుడు శివస్వామిని ఆడువేషముతో తీసుకొనివచ్చి రాజుకు అప్పగించుట

అతని మాటలు విని యా రాజపుత్రిక ఆసనముపైనుండి దిగ్గునలేచి శివస్వామి ధైర్యసాహసములకు లోలోపల సంతసించుచు, గాఢాలింగనం గావించు కొని లోపలికి తీసుకొనిపోయి తన శయనాగారమున రహస్యముగ ఉంచి, అతనితో హాయిగ సుఖించుచుండెను.

ఇట్లు జరుగుచుండగా మంత్రి కుమారుడు ఒకనాడు రాజువద్దకుపోయి

రాజపుత్రిని తనకు యిచ్చి వివాహం చేయగోరెను. రాజందుకు యిష్టము లేని వాడై సిద్ధుడు తనవద్ద ఉంచి వెళ్ళిన కపటసుందరిని అతనికిచ్చి పెండ్లి చేసెను.

వివాహమయిన తరువాత వారిద్దరిని పడకటింటికి పంపిరి. అప్పుడా సుందరి వేషమున నున్న బ్రాహ్మణ యువకుడు తనను ముట్టుటకు ప్రయత్నించు చున్న మంత్రి కుమారుని చూచి "నాథా! నన్నొక భూతము పట్టి బాధించు చున్నది. నన్నంటకుము. అది నిన్ను చంపునని భయపడుచున్నాను. నీవు ఆరునెలలు తీర్థయాత్రలు చేసి, ఆయా నదులలోని పవిత్ర జలములు తెచ్చి నాపై జల్లించిన యెడల ఆ భూతము తొలగిపోవును. అప్పుడు మనం నిశ్చింతగా ఉండి దాంపత్యసుఖము అనుభవింపవచ్చును. కావున వెంటనే నీవట్లు చేయుము" అని చెప్పెను.

ఆ మాటలు నిజమని నమ్మి మంత్రి కుమారుడు తీర్థయాత్రల కేగెను. అతడట్లు వెళ్ళిన తరువాత కొన్నాళ్ళకు సిద్ధయోగి ఒక శిష్యునితో రాజువద్దకువచ్చి "మహాప్రభూ! మీ వద్ద ఉంచి వెళ్ళిన కన్యను ఈ నా శిష్యునకు యిచ్చి పెండ్లి చేయవలెను." అని కోరగా, రాజు నిరుత్తరుడై, ఏమి చెప్పుటకు తోచక, ఆ యోగి పాదములపై పడి, జరిగిన సంగతులు చెప్పి "స్వామీ! జరిగినదానికి చింత పడి ప్రయోజనము లేదు. ఈ మీ శిష్యునకు నా పుత్రికనిచ్చి పెండ్లి చేసెదను. ఆగ్రహింపక అంగీకరించుడు" అని వినయముగ కోరెను.

సిద్ధయోగి అందుకు యిష్టపడెను. అంతట రాజు అతని శిష్యునకు తన కుమార్తె నిచ్చి వివాహము చేసెను. పిమ్మట యోగి వారిని తీసికొని తన గ్రామమునకు పోవుచుండగా స్త్రీ వేషమున నున్న బ్రాహ్మణుడు వచ్చి "ఇది నా

భార్య" అనెను. శిష్యుడు "ఈమె నా భార్య" అని గద్దించి చెప్పెను. ఓ విక్రమాదిత్య మహారాజా! ఆ రాజపుత్రిక ఎవరి భార్య యగును?" అని భేతాళుడు ప్రశ్నించగా "తండ్రి ఇష్టపడి ఇచ్చినవానికే రాజపుత్రి భార్యయగును కాని దొంగతనముగ వచ్చి కూడిన వానికి కాద"నివిక్రమాదిత్యుడు చెప్పెను.

తక్షణము భేతాళుడు బంధ విముక్తుడై చెట్టుపైకి పోయెను.

# భేతాళుడు చెప్పిన - నాగరాజు కథ

పట్టు విడువని విక్రమార్కుడు మరల చెట్టుపైకి పోయి, భేతాళుని బంధించి తీసుకొని వచ్చుచుండగా భేతాళుడు ఇట్లు ఒక కథ చెప్పసాగెను—

"ఓ విక్రమాదిత్య మహారాజా! వినుము. నాగపురము అను నొక పట్టణము కలదు. దానిని జీమూతవాహనుడు అను రాజు పాలించుచుండెను. అతడు ధర్మము తప్పక రాజ్యమును పాలించుచు రాజులందరికంటె ఉత్తముడని పేరు పొందెను. అతడు తన రాజ్యమున జరుగు వింతలను, విశేషములను గూఢచారుల వలన గాక, రహస్యముగ తానే రాజ్యమందు తిరిగి తెలుసుకొనుచుండెను.

ఆ సమయమున అతని రాజ్యమునందలి ఒక అడవిలో అసంఖ్యాకము లగు సర్పము లుద్భవించెను. వానిని చూచి గరుడుడు ప్రతిదినము ఆ ప్రాంతమునకు వచ్చి సర్పములను పట్టి భక్షించుచుండెను. గరుడుని చర్యలకు నాగములు భయపడి, ఒకచోట సభచేసి తమకు గరుడుని వలన కలుగుచున్న ఆపదను తొలగించుకొనుటకై తగు మార్గమును గూర్చి ఆలోచించుకొని, తుదకు గరుత్మంతునకు ఒక విన్నపము అందజేసికొనవలెనని తీర్మానించుకొన్నవి. ఆనాడు గరుడుడు

వచ్చు వేళకు అన్ని పాములు ఒకచోట నిలబడి, "పక్షీంద్రా! మాదొక చిన్న మనవి కలదు. దయయుంచి వినుము" అని ప్రార్థించినవి. "ఏమిటా మనవి చెప్పుడు" అని గరుడుడు అడిగెను.



సర్పములు గరుత్మంతుని ప్రార్థించుట

అంతట ఆ సర్పములు "పక్షిరాజా! మేము ఈ అరణ్యమున పరుల జోలికి పోక, మీకు దాసులమై జీవించుచున్నాము. ఇట్లు జీవించుచున్న మమ్ము అనేకమందిని ప్రతిదినము చంపి, తిని పోవుచున్నారు. ఇట్లు కొంతకాలము

జరిగిన మా వంశమే లేకుండ పోవును. అప్పుడు మీకు తగిన ఆహారము లేకుండ పోవును. అట్టి దుస్థితి కలుగకుండ మాలో ఒకరము వంతు ప్రకారం మీ వద్దకు వచ్చి ఆహార మయ్యెదము. మేము మాట తప్పము.దయయుంచి ఇందుకు అంగీకరించుడు" అని కోరినవి.

సర్పముల కోరిక విని గరుత్మంతుడు జాలిపడి "మంచిది. అట్లే చేయుడు" అని పలికి వెళ్ళిపోయెను. ఆనాటినుండి సర్పములు వంతులు వేసి కొని, రోజుకొకటి చొప్పున గరుడుని వద్దకుపోయి ఆహారమగుచుండెను.

ఆ విధముగా కొంతకాలం జరిగెను. ఒకనాడు శంఖచూడుడను సర్పం గరుడునకు ఆహారముగా వెళ్ళవలసి వచ్చినది. అతని తల్లికి ఒకడే పుత్రుడు. అతనిని వదలి ఆమె బ్రతుకజాలదు. అందువలన ఆమె తన ఏకైక పుత్రుని విడువలేక గోడుగోడున దుఃఖించుచుండెను. ఆమె స్థితిచూచి తక్కిన సర్పములు కూడ చింతించసాగినవి.

ఇంతలో తన రాజ్యమునందలి వింతలు, విశేషములు తెలుసుకొనవలె నని బయలుదేరిన జీమూతవాహనుడు అచ్చటికి వచ్చెను. ఆమె దుఃఖించుటకు గల కారణము తెలిసికొని ఎంతో జాలిపడెను. ఆమె నోదార్చి, శంఖచూడుని దగ్గరకు పిలిచి "నాయనా! చింతపడకుము. నీకు బదులుగా నేను గరుత్మంతు నకు ఆహారమయ్యెదను. నీవు నీ తల్లితోనుండి ఆమెను చక్కగా చూడుము" అని ధైర్యము చెప్పుచుండగా, గరుడుడు అచ్చటికి వచ్చెను. తనకు ఆహారం పంపుటకు ఆలస్యం చేసినందుకు మండిపడుచుండెను.

అప్పుడు జీమూతవాహనుడు గరుడునిచూచి, నమస్కరించి "పక్షిరాజా!

నీవు శంఖచూడుని వదలి నన్ను తిని నీ ఆకలి దీర్చుకొనుము. ఇతడు త
ఒక్కడే బిడ్డడు" అని నచ్చజెప్పెను. గరుడు డతని మాటలు విని, ఆనంది
"జీమూతవాహనా! నీ స్వార్థత్యాగమునకు నేను సంతసించితిని. నీకు వల
వరం కోరుకొనుము. ఇచ్చెదను" అనెను. అదివిని జీమూతవాహనుడు "
వాహనా! నా కేమియు అక్కరలేదు. నేటినుండి బ్రతికిన సర్పముల జోలికి పో
మాట యిమ్ము. ఇదియే నా కోరిక" అని చెప్పెను. గరుడు డతని కోరిక
ఆనందించి "అట్లే కానిమ్ము" అని అంగీకరించి వెళ్ళిపోయెను.

ఆ నాటినుండి సర్పములు గరుత్మంతుని భయం లేక సుఖంగా ఉన్న
విక్రమార్క మహారాజా! గరుడ జీమూతవాహనులలో ఎవరు శ్రేష్ఠులో చెప్ప
మని భేతాళుడు ప్రశ్నించగా "చూచిన సర్పమును చూచిన వెంటనే భక్షిం
స్వభావం గల గరుడుడు బ్రతికివున్న సర్పములను ముట్టనని మాట యిచ్చు
చాల గొప్ప సంగతి. కావున గరుత్మంతుడే శ్రేష్ఠుడు" అని విక్రమార్కు
చెప్పెను. అట్లు చెప్పిన వెంటనే భేతాళుడు బంధవిముక్తుడై ఎగిరి చెట్టుమీది
పోయి నిలబడెను.

# భేతాళుడు చెప్పిన - వైశ్యకన్య కథ

అంతట విక్రమాదిత్యుడు వేగంగా చెట్టుమీదికి పోయి భేతాళుని ప
బంధించి తీసుకొని వచ్చుచుండగా "రాజోత్తమా! ఒక కథ చెప్పుతున్నా
వినుము. ధర్మపురమను పట్టణమును విశారదుడను రాజు పాలించుచుండెన
అత డొకనాడు పురవీధులలో విహరించుతున్న సమయమున ఒక వైశ్యకన

ఎదురు పడెను. ఆమె ఎంతో అందంగా ఉండెను. అంత అందమైన
ఆ రాజు ఎన్నడును చూడలేదు. అతడామె అంద చందములకు ముగ్ధుడై,
మోహించి పెండ్లాడదలచెను.

మరునాడు ఆ రాజు పురోహితుని పిలిపించి తానుచూచిన వైశ
గూర్చి తెలిపి, ఆమె జాతకమును తెలుసుకొని రమ్మని చెప్పెను. అంత
హితుడు వర్తకుని ఇంటికి వెళ్ళి, రాజాజ్ఞ నెరిగించి అతని కుమార్తె జాత
యిమ్మని కోరెను. పురోహితుని మాటలు విని వైశ్యుడు ఎంతో ఆనంది
పుత్రిక జాతక మాయనకు యిచ్చెను. పురోహితుడు వైశ్యకన్య జాతకమ
రాజువద్దకు వచ్చి "మహారాజా! మీరా కన్యను పెండ్లియాడినచో రా
లగుదురు" అని చెప్పెను.

ఆ సంగతి విని రాజు ఆ వైశ్యకన్యపై గల వ్యామోహమున
పెట్టి ఆ సుందరాంగి ఇతరుల పాలు కాకుండ తన ప్రధానమంత్రికి వి
చేయించెను.

కొంతకాలం గడచిన తరువాత రాజు ఒకనాడు పట్టణ వీదులలో
టించుచు, మంత్రి గృహోపరిభాగమున నిలచియున్న ఆ వైశ్యకాంతను
ఆమె అందచందముల కలరి, మోహించి విరహతాపం నందెను. రా
తున్న విరహవేదనని చూచి ప్రధానమంత్రి జాలిపడి, తన భార్యయగు
యువతిని పిలిచి "నీవుపోయి రాజు యొక్క కోర్కెను దీర్చి రమ్మ"ని చె

భర్త మాట కెదురాడక ఆ వైశ్యకాంత వెంటనే రాజు
పోయెను. రాజు ఆ యువతిని చూచి పరకాంత నంటుట పాపమని, అట్లు

తన కులమునకు, రాజ ధర్మమునకు కళంకమని తలచి, ఆమెను గౌరవంగా ప్రధాని వద్దకు పంపివేసెను. కాని రాజు దీరని విరహ తాపమునకు గురియై మనోవ్యాధితో మంచమెక్కి తుదకు మరణించెను. తన భార్యపైగల మోహ మణచుకొనలేక రాజు మరణించినందుకు మంత్రి మిగుల చింతించి తుదకు ప్రాణం వదలెను. ఓ విక్రమార్క మహారాజా! వారిద్దరిలో నెవరు శ్రేష్ఠులో నిర్ణయించి చెప్పు"మని భేతాళుడు ప్రశ్నించగా-"రాజు మోహపరవశుడై యుండియు తన దగ్గరకు వచ్చిన యువతిని అంటక భర్తవద్దకు పంపివేయుట ఆమెయందు కలిగిన మోహ మణచుకోలేక ప్రాణత్యాగం చేయుట గొప్ప విషయం" అని విక్రమార్కుడు చెప్పెను. అట్లు చెప్పిన వెంటనే బేతాళుడు బంధ విముక్తిపొంది చెట్టుమీదికి పోయెను.

## భేతాళుడు చెప్పిన - మునిపుత్రిక కథ

విక్రమాదిత్యుడు విసుగుచెందక తక్షణం చెట్టుపైకి పోయి భేతాళుని పట్టి బంధించి దీసుకొని వెళ్ళుచుండగా "రాజా! ఒక కథ చెప్పుతున్నాను,వినుము విజయపురమను పట్టణమును శూరసేనుడనే రాజు పాలించుచుండెను. అతడు గొప్ప ధైర్య సాహసములు కలవాడు. అతడు తరుచు వేటాడుటకై అడవులకు పోవుచుండెడివాడు.

శూనసేను డొకనాడు వేటాడుటకు మహారణ్యమునకు పోయెను. అప్పుడతడొక అందమైన కన్యను చూచెను. ఆమెయొక్క అందచందములు చూచి ముగ్ధుడై ఆమె సమీపమునకు పోయి "యువతి! నీ వెవరిదానవు? తన

దేవతవా? దేవకన్యవా? ఒంటరిగా యిచ్చట సంచరించుచుంటివేమి?" అని యడిగెను.

రాజు మాటలు విని ఆ కన్య మందహాసము చేసి "నేనొక ముని పుత్రికను. మేమీ యరణ్యముననే నివసించుతున్నాము" అని చెప్పెను. రాజామెను చూచి మోహించి తనను వివాహమాడగోరెను.

మునికన్య రాజు మాటలు విని "రాజా! మునికన్యనగు నన్ను నీవు వరించుట యుక్తముకాదు. నేను మునివృత్తినుండు పేదదానను. మీరు మహా రాజులు. మీతో నాకు సంబంధము తగదు" అని చెప్పగా, రాజు ఆమెను బ్రతి మాలి యొప్పించి గాంధర్వ వివాహం చేసికొనెను.

పిమ్మట వారొక చెట్టునీడకుపోయి సరసల్లాపములాడుతుండిరి. అప్పు డొక రాక్షసుడు అక్కడికి వచ్చి రాజును పట్టి మ్రింగబోయెను. రాజతనితో కొంత సేపు పోరాడి, శక్తిహీనుడై రాక్షసునకు లొంగిపోయి తనను మ్రింగవలదని బ్రతి మాల సాగెను.

అప్పుడా రాక్షసుడు రాజును చూచి "రాజా! నీవు తల్లిదండ్రులుగల పిల్లవానిని తెచ్చి నాకు ఆహారముగ నిత్తువేని నిన్ను మ్రింగక వదలెదను" అని చెప్పెను. రాజు అలాగే తెచ్చి యిచ్చెదనని వాగ్దానం చేసి, తక్షణం గుఱ్ఱముపై తన రాజ్యమునకు వచ్చెను. వెదుకగా వెదుకగా వారికి నిరుపేదలగు బ్రాహ్మణ దంపతులు కనబడిరి. వారికొక కుమారుడు కలడు. వారా బాలుని పోషించుటకు చాల కష్టపడుతుండిరి. వారికి రాజు విశేషధనమిచ్చి ఆ బాలుని తీసికొనివెళ్ళి రాక్షసుని ముందుంచెను. రాక్షసుడు ఆ పిల్లవానిని మ్రింగబోవుతుండగా పిల్లవాడు

పకపక నవ్వెను. వెంటనే రాక్షసుడా పిల్లవానిని విడిచి మాయమైపోయెను. విక్రమాదిత్య మహారాజా! ఆ పిల్లవాడు పకపకమని నవ్వుటకు కారణమేమి?" అని భేతాళుడు ప్రశ్నించగా, "బేతాళా! పరులు తిట్టి కొట్టునపుడు వారితో



రాక్షసునితో పోరాడుచున్న రాజు వారి యుద్ధమును చూచి భయపడుచున్న మునికన్య

పోరాడి కొడుకును రక్షించువారు తల్లిదండ్రులు. తల్లిదండ్రుల అన్యాయమునకు గురియైనవారిని రక్షించువాడు రాజు. రాజుచేయు దుష్టకార్యముల నుండి రక్షించు

నది దైవము. అట్టి దైవమే దయలేక మ్రింగజూచిన ఇక దిక్కేమున్నది అను కొని ఆ బాలుడు నవ్వె"నని విక్రమార్కుడు చెప్పిన తక్షణము భేతాళుడు పైకెగిరి చెట్టుమీదికి పోయెను.

## భేతాళుడు చెప్పిన - రామశర్మ కథ

మరల విక్రమాదిత్యుడు భేతాళుని బంధించి తీసికొని వచ్చుచుండగా అతడు క్రింది విధముగా ఒక కథ చెప్పెను— "సోమశర్మయను బ్రాహ్మణుడు ప్రశాంతి అను నగ్రహారమున నివసించుచుండెను. అతనికి రామశర్మయను కుమారుడు ఉండెను. రామశర్మ పదునారవఏట అపమృత్యువాతబడెను. తమకున్న ఒక్కగానొక్క కుమారుడు మరణించినందువలన తల్లిదండ్రులు తీరని విచారమున మునిగి గోడుగోడున ఏడ్చుచుండిరి. కొంతసేపు అట్లుయేడ్చి చేయునదిలేక కొడుకును శ్మశానమునకు తీసుకొనిపోయి చితిపై నుంచి అగ్నిసంస్కారము చేయుటకు చేతులాడక, దుఃఖముపట్టలేక బిగ్గరగా ఏడ్చుచుండిరి.

అట్టి సమయమున వారి అదృష్టవశమున పరకాయవిద్య తెలిసిన ఒక యోగి అచ్చటికి వచ్చెను. పుత్రుని కొరకు ఘోరముగా ఏడ్చుచున్న తల్లిదండ్రులనుచూచి జాలిపడి, తన నిజదేహమును వదలి చితిపై నుంచిన ప్రేతమున పరకాయ ప్రవేశము చేసెను. వెంటనే బాలుడు నిద్రనుండి లేచినవానివలె పైకిలేచి కూర్చుండెను. అదిచూచి తల్లిదండ్రులు పట్టరానంత సంతోషమును పొందిరి. కొడుకును తీసుకొని ఆనందంగా యింటికి బయలుదేరిరి. వారివెంట పోవుచున్న ఆ బాలుడు మొదట ఏడ్చెను. తరువాత నవ్వెను. విక్రమార్క మహారాజా! ఆబాలు



కొడుకు మృతదేహమును చితిపైనుంచి దుఃఖపడుచున్న దంపతులు అచ్చటికి వచ్చిన యోగి

డావిధముగా నవ్వుటకును, ఏడ్చుటకును కారణమేమి?" అని ప్రశ్నించగా "ఆహా! విధివ్రాత ఎంత బలీయమైనది? ఎంతో ప్రేమగా తల్లిదండ్రులు పెంచి పెద్దగావించిన శరీరమును వదిలితిని గదా? అనుకొని యేడ్చెను. తరువాత జీర్ణదేహమును విడిచి పసిదేహమున దగిలితిని గదా! అనుకొని నవ్వెను" అని విక్రమార్కుడు జవాబిచ్చెను. వెంటనే భేతాళుడు చెట్టుపైకెగిరెను.

# భేతాళుడు చెప్పిన - మాధవి కథ

విక్రమాదిత్యుడు మరల భేతాళుని పట్టితెచ్చుచుండగా ఇట్లొక కథ చెప్పసాగెను— "విక్రమార్క మహారాజా! కృష్ణాపురమను పట్టణమును సుశీలుడను రాజు ధర్మము తప్పక పాలించుచుండెను. ప్రజలాయనయందు మిక్కిలి గౌరవం కలిగియుండిరి.



ఆరాజు ఒకనాడు నగరవీధులలో పర్యటించుచున్న సమయమున మాధవి యనునొక సుందరాంగి కనబడెను. రాజు ఆమె చక్కదనమున కలరి, మోహించి యామెకు తనకోరిక తెలిపి, ఒప్పించి ఆమెను తీసికొని వేరొక పట్టణమునకు పోవుచుండగా కొందరు దొంగలువచ్చి వారినడ్డుకొనిరి. రాజు ఆ దొంగలనెదుర్కొని భయంకరముగా పోరాడి చంపివేసెను. పిమ్మట మాధవిని తీసుకొని ఒక పట్టణ సమీపముననున్న పాడుదేవాలయములోనికి పోయెను. అచ్చట నొక శుభ్రమైన స్థలమున మాధవిని ఉంచి, ఆహారం తెచ్చుటకై పట్టణంలోనికి పోయెను. విపణివీధిలో నతడు ఆహారపదార్థములు కొనుచుండగా నొకవేశ్య వచ్చి ఆయనను చూచి "అయ్యా! మాయింటికి రండు. కడుపునిండ భోజనముపెట్టి మీ ఆకలి తీర్చెదను" అని బలవంతపెట్టి తమ గృహమునకు తీసుకొనివెళ్ళి తన నాయకికి చూపించెను. ఆమె రాజునుచూచి మోహించి భార్యవలె ప్రవర్తించుచు ఆయనకు తగు సేవలుచేసి మెప్పించి, తనవద్ద ఉండిపోవునట్లు చేసికొనెను.



ఆహారము తెచ్చుటకై పోయిన రాజు ఎంతసేపటికిని రానందున పాడు దేవాలయములోనున్న మాధవి దుఃఖపడసాగినది. అప్పుడొక వైశ్యుడు అచ్చటికి

వచ్చి, ఆమె దుఃఖమునకు కారణం తెలిసికొని, తనగృహమునకు రమ్మని పిలుచుకొని వెళ్ళి ఆమెకు కావలసిన పదార్థములనిచ్చి సంరక్షించుచుండెను.



ఎలుకను చంపి భార్య వద్ద బడాయిలు చెప్పుకొంటున్న వైశ్యుడు

ఒకనాటి రాత్రి వైశ్యుని యింటనొక ఎలుక ప్రవేశించెను. వైశ్యుడా ఎలుకను చంపి గొప్పకార్యము చేసినవానివలె ప్రగల్భములు చెప్పెను. అది విన్న మాధవి నన్నిచ్చటికి తెచ్చిన రాజు పలువురు దొంగలతోపోరాడి చంపినాడు కాని

నీవలె ప్రగల్భములు పలుకలేదు. నీవు అల్పుడవు. నీతో సహవాసము చేసిన నాకు కష్టములు తప్పవు. నీరక్షణలో ఉండుటకంటె మరణించుట మేలు" అని చెప్పి, ఉరివేసికొని చనిపోయెను. తానువలచి తెచ్చుకొన్న యువతి ఆత్మహత్య చేసికొనుటకు కారణం తన ప్రగల్భములే అని గ్రహించి ఆ వణిజుడు తన యింటనున్న వస్తువులను, ధనమును పేదలకు పంచిపెట్టి బావిలోపడి మరణించెను.

వేశ్యయింటనున్న ఆ రాజు మాధవి మరణవార్తవిని తానామెకుచేసిన అన్యాయమునకు చింతించి, బ్రతికియున్న అపవాదు కలుగునని భయపడి కత్తితో పొడుచుకొని చచ్చెను. అతడట్లు చచ్చుటకు కారణము నేనేగదా అనుకొని ఆవేశ్య ఉరివేసికొని చచ్చెను. ఇట్లు మరణించిన నలుగురిలో ఎవరు అధికులు" అని భేతాళుడు ప్రశ్నించగా "ఆ నలుగురిలో వేశ్య అధికురాలు. మిగిలినవారు మోసము వలన చచ్చిరి" అని విక్రమార్కుడు చెప్పగానే భేతాళుడు కట్లుతెంచుకొని రివ్వున చెట్టుమీదికి పోయి నిలబడెను.

# భేతాళుడు చెప్పిన - వావివరుసలెరుగని వారి కథ

అంతట విక్రమాదిత్యుడు యధాప్రకారం చెట్టుమీదికి పోయి భేతాళుని పట్టి బంధించి తీసుకొని పోవుచుండగా భేతాళుడు "మహారాజా! నీకొక విచిత్రమైన కథ చెప్పుచున్నాను వినుము" అని క్రింది కథ చెప్పెను.

"మహావీరుడు అనునొకరాజు భూలోకమంతయు చూడవలెనను తలంపుతో తన భార్యను, కూతురును, రాజ్యమును విడిచి ఒంటరిగా బయలుదేరివెళ్ళెను. ఎన్నిదినములైనను అతడు తిరిగి రానందున భార్యయు, కూతురును అతనిని

గురించి వెదకుచుపోయిరి. వారు అనేకఊళ్లు, వనములు దాటిపోవుచుండిరి. ఎవరి నడిగినను వారికి మహావీరుని జాడ తెలియకున్నది.

వారట్లు పోవుచున్న సమయమున, మార్గమధ్యమున వారివెనుక నొక బ్రాహ్మణుడును, అతని పుత్రుడును వచ్చుచుండిరి. అప్పుడు తండ్రి కొడుకును చూచి "మనకంటెముందుగ నెవరో ఇద్దరు స్త్రీలు వెళ్ళుచున్నట్లు వారి కాలి జాడల వలన తెలియుచున్నది. ఇందు పెద్దఅడుగులు గలదాని నేను పెండ్లాడెదను. చిన్న అడుగులు గలదానిని నీవు వివాహమాడుము" అని ఒప్పందము గావించుకొనిరి. అచ్చటినుండి వారు వేగముగాపోయి తమకంటె ముందువెళ్ళుచున్న తల్లీ కూతుళ్ళను కలిసికొని, వారికి తమ ఒప్పందమును గూర్చి చెప్పిరి. వారందుకు అంగీకరించినారు. కాని వారు ఊహించినదానికి పరిస్థితి భిన్నంగా ఉన్నది. తల్లిఅడుగులు చిన్నవిగను, కూతురు అడుగులు పెద్దవిగను ఉన్నవి. అందువలన కూతురుని బ్రాహ్మణుడును, తల్లిని ఆ బ్రాహ్మణుని కుమారుడును పెండ్లాడిరి.

కొన్ని దినములకు ఆ ఇద్దరు స్త్రీలు ఇద్దరు బిడ్డలను కనిరి. అట్లు పుట్టిన ఆబిడ్డల వావివరుసలెట్టివో తెల్పు"మని భేతాళుడు ప్రశ్నించగా, విక్రమాదిత్యు డేమియుతోచక మౌనముగా ఉండెను. అంతట భేతాళుడు చెట్టుపైకి పోక, రాజుముందు ప్రసన్నవదనము కలవాడై నిలచెను. తరువాత తన నిజస్వరూపము చూపి "రాజాధిరాజా! నీయెడల నేను కృతార్థుడనైతిని. నా పుట్టుపూర్వోత్తరములు నీకు తెలియజేసెదను, వినుము" అని క్రింది విధముగా చెప్పెను:

# భేతాళుని పూర్వజన్మ కథ

పూర్వము నేనొక బ్రాహ్మణుడను. నన్ను కాళేశ్వరశర్మ అని పిలిచెడివారు. నా నివాసస్థలము త్రిశిరపురము. అయూరనున్న శివక్షేత్రంనకు పూజారినై యుంటిని. ఒకనాడు నేను పార్వతీపరమేశ్వరులకు పూజానైవైద్యాదులు జరిగిన తరువాత గుడితలుపులు మూసి తాళమువేసి బయటకు వచ్చితిని. నైవేద్య ప్రసాదములు తెచ్చుకొనకుండ అచటనే మరచివచ్చినట్లు జ్ఞాపకమునకు వచ్చెను. అప్పుడు నేను వాటిని తెచ్చుకొనుటకై తిరిగి తలుపులు తెరచి లోనికిపోబోయితిని. గుడిలోనెవరో వున్నట్లు నాకుఅనిపించినది. నాకుతెలియకుండ లోనికి ఎవరు పోయినారో రహస్యముగ గమనించవలెనని తలుపునందునుండి లోనికి చూచితిని. నా కండ్లనునేను నమ్మలేకపోయితిని. పరమేశ్వరుని ఒడియందు పార్వతిదేవి కూర్చుండియున్నది. ఆయమ్మ ఈరేడులోకములందు ఇంతవరకు జరుగని కథ ఒకటి చెప్పుడని యడుగగా, పరమేశ్వరు డామెకోర్కెను మన్నించి ఇరువది మూడు కథలను చెప్పెను. ఇరువది నాల్గవకథగా వావివరుసలు తెలుసుకొనజాలని విచిత్రకథ చెప్పెను.

నేను పరమేశ్వరుడు పార్వతీదేవికి చెప్పిన కథలనన్నిటిని రహస్యముగా వింటిని. కొకుల అరపువిని. తెల్లవారుచున్నదని గ్రహించి ఇంటికిపోయితిని. ఇంత ఆలస్యముగ వచ్చుటకు కారణమేమని నాభార్య యడుగగా, నా దురదృష్ట వశమున జరిగిన విషయములన్నియు చెప్పి ఈ విషయములను ఎవరికి చెప్పవద్దని, ఈ కారణమువలననే ఇంటికి వచ్చుట ఆలస్యమైనదని చెప్పితిని.



పరమేశ్వరుడు పార్వతీదేవికి కథ చెప్పుచుండగా పూజారి రహస్యముగా

ఇంతలో సూర్యోదయమైనది. నా భార్య బిందెతీసు
పోయినది. అచ్చట కలసిన తన స్నేహితురాళ్ళందరికి ఆ కథలు
వారినోట రహస్యము లణగి ఉండునా? అవి పెల్లుబికి ఆనోట ఈ
దేశమంతకు ప్రాకినవి. ఎచ్చట చూచినను ఆ కథలు చెప్పుకొను

ఒకనాడు పరమేశ్వరుడు నాకు ప్రత్యక్షమై "ఓరీ బ
పార్వతికి చెప్పిన కథలన్నిటిని రహస్యముగా వింటివి. విన్నవాడ

నీ భార్యకుచెప్పి లోకులెల్లరు చెప్పుకొనునట్లు చేసితివి. నీవు
లకు శిక్షగా తక్షణం బేతాళుడవగుదువుగాక!" అని శపించెను.
వాక్యాలువిని తీరని దుఃఖముపొంది స్వామిపాదములపై పడి
చితిని. పరమేశ్వరుడు నాస్థితికి జాలిపడి "ఓరీ, ఉజ్జయిని మ
నకు క్రోసు దూరముననొక మహారణ్యము కలదు. ఆ యెడ
పలాశవృక్షము కలదు. దానికనేక శాఖలు కలవు. అందొకశా
ముప్పది సంవత్సరములు తలక్రిందుగ వ్రేలాడుచుండుము.
జ్ఞానశీలుడను యోగి మహాకాళి దేవాలయమున తపస్సుచేయు
దేవిసన్నిధిని యజ్ఞకుండ మేర్పరచి యాగముచేయు తలంపుక
తపస్వికి సహాయపడుటకై విక్రమాదిత్యుడు అంగీకరించి
అపుడు తపస్వి ఆజ్ఞపై నిన్ను కట్టి తీసుకొనిపోవుటకు వచ్చు
ఒక్కొక్క కథచెప్పి తగుజవాబులందుము. ఆతడు ఏకథక
మౌనమువహించునో అప్పుడతనికి లొంగియుండి రెండువేలేం
ముగా నుండుము. పిమ్మట కైలాసప్రాప్తినందగలవు"
మయ్యెను.

సర్వేశ్వరుడు చెప్పిన లక్షణములన్నియు మీలో
విక్రమాదిత్య మహారాజేయని గ్రహించితిని. నేను ఈనాటినుం
ఉండి సహాయపడుచుండెదను" అని చెప్పగా, విక్రమాదిత్యు
డవు కావున నేను నీపై నెక్కి తిరుగరాదు" అని చెప్పగా
బ్రాహ్మణుడుగా లేను. బేతాళునిగా ఉన్నాను. కావున నీవు

గ్రహింపవచ్చును" అని చెప్పగా, విక్రమాదిత్యుడు అట్లే చేయుదమని అంగీకరించెను.

అప్పుడు బేతాళుడు విక్రమార్కుని ముందు వినయముగా నిలబడి "మహారాజా! నేనొక మనవి చేసికొనుచున్నాను. శ్రద్ధగా వినుడు. మీరు నన్ను పరిగ్రహించుట వలన మీరునాకు యజమానులైరి. నేను భృత్యుడనైతిని. కావున తమకు రానున్న ఆపదలనెరిగించి తగుఉపాయములను చెప్పగలను. మీరు నన్ను బంధించి ఆ తపోనిధికి అప్పగించిన వెంటనే అతడు మిమ్ము సాష్టాంగనమస్కారములు చేయుము అని చెప్పును. మీరు అట్లుచేసినచో అతడు మీతల ఖండించి కాళికర్పించి తన కోర్కెలను నెరవేర్చుకొనును. మహంకాళి అతనికి ప్రత్యక్షమై కోరిన వరములనిచ్చును. కావున మీరు చాల మెలుకువగా ఉండవలెను. అతడు మిమ్ము సాష్టాంగ నమస్కారము చేయమన్న అట్లుచేయకుడు. నాకట్లు చేయుట తెలియదు. మీరొకసారి చేసిచూపుడని అడుగుడు. అతడందు కంగీకరించి సాష్టాంగ నమస్కారము చేయునప్పుడు అతని తల నరుకుడు. ఏమాత్రము వెనుకాడినను మీ ప్రాణమునకు ముప్పుకలుగును" అని చెప్పెను.

విక్రమాదిత్యుడు అతని మాటలువిని ఆనందించి "అట్లే చేయుదు" నని బేతాళుని తోడ్కొనిపోయి మునీశ్వరునకు అప్పగించి నిలబడెను. అప్పుడా ముని విక్రమార్కుని అభినందించి, దేవి ముందుకువెళ్ళి సాష్టాంగ నమస్కారము చేయుమని చెప్పెను. అదివిని విక్రముడు బేతాళుడు చెప్పినట్లే చెప్పెను. అంతట ఆ మునీశ్వరుడు దేవిముందుకు పోయి సాష్టాంగ నమస్కారము చేయుచుండగా విక్రమాదిత్యుడు తక్షణమతని శిరస్సును ఖండించెను. వెంటనే కాళికాదేవి విక్ర

మాదిత్యునకు ప్రత్యక్షమై "వత్సా! నీ ధైర్యసాహసములకు మెచ్చుకొంటిని. నీకు కావలసిన వరములు కోరుకొనుము. యిచ్చెద"ననెను.



విక్రమార్కుడు ముని శిరస్సు ఖండించుట
మహాంకాళి ప్రత్యక్షమగుట

విక్రమాదిత్యుడు దేవిని చూచి బ్రహ్మానందభరితుడై ఆమెననేక విధముల స్తుతించి "తల్లీ! నీ పాదదాసుడనగు నాకు ఎల్లప్పుడు ధర్మచింతయు, అసమాన బలపరాక్రమములను, నేను కోరినపుడు నీ దర్శనమును యిచ్చి అను

గ్రహింపుము. నా పాలనలోగల ప్రజలు కష్టనష్టములకు గురికాక సుఖముగా ఉండునట్లు చూడుము. అంతేగాక ఈ మునీశ్వరుడు నీకు బలియిచ్చిన రాజపుత్రుల నందరిని బ్రతికించుము" అని కోరెను.

మహాకాళి విక్రమార్కుడు కోరిన వరములన్నిటిని ప్రసాదించి, ఆశీర్వదించి అదృశ్యమయ్యెను.

పిమ్మట విక్రమాదిత్యుడు బేతాళునిపై నెక్కి ఆనందముగా తన రాజధానికి పోయి ధర్మము తప్పక రాజ్యపాలన చేయసాగెను.

## విక్రమాదిత్యుడు మొసలివాత పడిన బ్రాహ్మణ పుత్రుని బ్రతికించుట

విక్రమాదిత్యుడు లోగడ నిశ్చయించుకొన్న ప్రకారం రాజ్యమును ఆరుమాసములు పాలించి, మిగిలిన ఆరుమాసములు భట్టితో పాలింప జేయుచు, బేతాళుని పైనెక్కి వనములు, పట్టణములు, వివిధ దేశములు దర్శించి, అనేక వింతలు విశేషములు తెలిసికొని వచ్చుచుండెను. ఈ విధంగా భట్టి-విక్రమార్కులు ప్రజలను తమ ప్రాణములతో సమానముగ చూచుచు రాజ్యపాలన చేయుచుండిరి.

ఇట్లు జరుగుతుండగా, ఉజ్జయినీ నగరమునందు నివసించుచున్న వేద కోవిదుడను బ్రాహ్మణుడు ఒకనాడు తన ఏకైకపుత్రునితో సముద్రస్నానం చేయుటకుపోయెను. అప్పుడొక మొసలి అతని కుమారుని పట్టి నీటి అడుగు భాగం

నకు ఈడ్చుకొని పోయినది. అది గమనించి ఆ బ్రాహ్మణుడు నెత్తీ నోరూ కొట్టుకొనుచు "అయ్యో! ఇదేమి అన్యాయం! ధర్మప్రభువగు విక్రమార్కుడు రాజ్యపాలన చేయుచుండ పాలితులయిన ప్రజలకు అకాలమృత్యువు లెట్లు వచ్చును? నూరేండ్లు నిండకముందే ప్రజలెట్లు చత్తురు? నా పుత్రున కేదేండ్లయిన నిండలేదు. ఇంతలోనే వీనికి చావెట్లు ప్రాప్తించినది. ఇది నేనుగాని, మా వంశంవారుగాని చేసిన దోషం వలన కలిగిన అరిష్టం కాదు. ఈ రాజ్యమును పాలించుతున్న విక్రమాదిత్యుడు ధర్మశాస్త్రముల ననుసరింపక యధర్మంగ వర్తించుచున్నాడు. లేకున్న నా బిడ్డ యకాల మృత్యురూపమున వచ్చిన మొసలినోట బడెడివాడు కాదు" అని రాజును నిందిస్తూ, అచ్చటినుండి పరుగు పరుగున పోయి రాజ ద్వారంవద్ద నిలిచెను. అచ్చటవున్న ఒక గుండ్రాయితో తల బాదుకొనెను. అందువలన నతని తల పగిలి ప్రవాహం వలె రక్తం స్రవించసాగెను. ఆ రక్తంతో నతని శరీరం అంతయు నిండిపోయెను, అతడు బిగ్గరగా నేడ్చుచు, గుండె బాదుకొనుచు, రాజును నిందిస్తుండెను.

ఆ సంగతి సేవకులు పరుగు పరుగున పోయి విక్రమాదిత్యున కెరిగించగా, నతనిని వెంటనే తోడ్కొనిరండని రాజు ఆజ్ఞాపించెను. సేవకులు ఆ బ్రాహ్మణుని తీసుకొని వెళ్ళి రాజు ముందుంచిరి.

రాజు అతని స్థితి చూసి జాలిపడి "బ్రాహ్మణోత్తమా! మీ రిట్లు దుఃఖపడుటకు కారణమేమి? మీరు ఎచ్చట నివసించుచున్నారు?" అని ప్రశ్నించగా ఆ వేదకోవిదుడు "నేను నివసించుచున్న దీ పాడు పట్టణమే! నా పేరు వేదకోవిదుడందురు. నాకు లేక లేక ఒక పుత్రుడు కలిగినాడు. వాని కింకను

ఏడేండ్లు నిండలేదు. లేకలేక పుట్టినవానిని కంటికి రెప్పవలె సాకుచు సకల కళా కోవిదునిగా చేయుటకు ప్రయత్నిస్తుంటిని. నేడు గ్రహణ స్నానమునకై ఇరువురం సముద్రమునకు పోయితిమి. మొలలోతు నీళ్ళలో నిలచి స్నానం చేయుచుండగా నొక పాడు మొసలి వచ్చి నా పుత్రుని పట్టి సముద్రం లోనికి ఈడ్చుకొని పోయినది. మీ పాలనలో పుట్టిన పిల్లలందరు నూరేండ్లు జీవించుచుండ నా పుత్రునకీ అకాలమృత్యువెట్లు సంభవించినది? మీరు మనుధర్మ నీతిని తప్పి ప్రవర్తించుచుండుట వలననే యిట్టి విపరీతం జరిగినది. లేకున్న ఇట్లు జరిగెడిది కాదు. ఏకైక పుత్రుని పోగొట్టుకొన్న వెనుక నా ప్రాణములున్న నేమి? పోయిననేమి? మీ ద్వారం వద్దనే తల పగులగొట్టుకొని ప్రాణములు వదలెదను" అని పట్టరాని దుఃఖంతో చెప్పెను.

ఆ మాటలు విని విక్రమాదిత్యుడు చాల నొచ్చుకొని "భట్టీ! కాల మహిమ కంటివే? మకరమట! పసిబిడ్డను మ్రింగెనట! మన పాలనలో నిట్టి విపరీతం జరుగుట నేను సహించలేను. ఇట్టి సంఘటనల వలన మన పాలనకు తీరని కళంకం కలుగుతున్నది. కావున నేను ఆ మొసలిని శిక్షించి, బ్రాహ్మణ కుమారుని బ్రతికించి తెచ్చునంతవరకు నిద్రపోను. నీవు ఇచ్చటనే ఉండి జాగ్రత్తగా రాజ్యపాలన చేయుచుండుము" అని ఆజ్ఞాపించెను.

పిమ్మట వేదకోవిదుడను బ్రాహ్మణుని చూచి "అయ్యా! కుమారునికై దుఃఖించకుము. ధైర్యంగా ఉండుము. నే నిప్పుడే బయలుదేరిపోయి ఆ మొసలిని శిక్షించి ఆరు మాసములలోపుగా నీ కుమారుని బ్రతికించి తెచ్చి నీకు అప్పగించెదను. అంతవరకు నేని రాజ్యమున అడుగుపెట్టను" అని

ధైర్యం చెప్పి సింహాసనంనుండి దిగి తిన్నగా తన కులదైవమగు మహాకాళి సన్నిధికి పోయి, ప్రదక్షిణ నమస్కారములు చేసి "తల్లీ! నేను తలపెట్టిన కార్యం జయప్రదమగునట్లనుగ్రహింపుము" అని ప్రార్థించెను. కాళికాదేవి అతని భక్తికి మెచ్చి ప్రత్యక్షమై విభూతిని, తీర్థమును యిచ్చి "ఇష్టార్థ సిద్ధి పొందు"మని ఆశీర్వదించి పంపెను.

ఆ విధంగా విక్రమాదిత్యుడు కాళీమాత వద్ద సెలవు తీసుకొని తన యంతఃపురమునకు వెళ్ళి రత్నకంబళమును, ఒక బెత్తమును, రాగి పాత్రను, పావుకోళ్ళను, ఆయుధములను తీసుకొని, భట్టిని పిలిచి నీతి తప్పక రాజ్యపాలన చేయుమని చెప్పి తన రాజ ముద్రాంగుళీయము నిచ్చి సెలవు తీసుకొని భేతాళుని వెంటబెట్టుకొని సముద్రం ఒడ్డుకు పోయెను.

పిమ్మట విక్రమార్కుడు సముద్రంలో దిగి రత్నకంబళమును పరచి దానిపై గూర్చుండి కొంతదూరంపోయి బిగ్గరగా అరచెను. అపుడా ప్రాంతమున నున్న మొసలి పరుగెత్తి వచ్చి యతనిని పట్టవచ్చెను. దానిని చూచి విక్రమాదిత్యుడు భయపడక దగ్గరకు పోయెను. అతని నా మొసలి గుటుక్కున మ్రింగెను. రాజట్లు మ్రింగుడుపడి దాని కడుపులో ప్రవేశించి చూడగా అందొక పట్టణము కనబడెను. ఆ పట్టణ మత్యంత రమణీయమయిన ప్రాకారములను, అందమయిన భవనసముదాయములను కలిగి అమరావతివలె శోభించుచుండెను. ఆ పురవీధులను పరీక్షించి చూచుచు నడిచిపోవుచుండగా నొక వీధిలో కొందరు బ్రాహ్మణ బాలురు పోవుచుండిరి. వారిలో వేదకోవిదుని కుమారుడు కూడ ఉండెను. వానిని చేరబిలిచి రాజు "నీ వెవరి పుత్రుడ"వని అడిగెను.



విక్రమార్కుడు మొసలి గర్భమున నున్న నగరములో ఆడుకొనుచున్న బ్రాహ్మణ బాలునిచూచుట

విక్రమాదిత్యుని మాటలు విని ఆ బాలుడు "అయ్యా! నా స్వస్థలము ఉజ్జయినీ మహాంకాళిపురము. సకల విద్యా విశారదుడగు వేదకోవిదుడను విప్రుడు నా తండ్రి. సముద్ర స్నానమునకు వచ్చి దురదృష్టవశమున మొసలి వాతపడి యిచ్చటికి తేబడితిని." అని చెప్పెను. అంతట విక్రమాదిత్యుడు తన చేత నున్న ఖడ్గముతో మొసలి దేహమును ఖండించి, బ్రాహ్మణ బాలుని వెంటబెట్టుకొని బయటకు వచ్చెను. రత్నకంబళమును సముద్రముపై పరచి ఆ బాలుని

కూర్చుండబెట్టి ఒడ్డుకు తీసుకొని పోయెను. అతడట్లు వచ్చునప్పుడు సముద్ర జలమా మకరము లోనికి పోయిన నందలి మహాపట్టణము పాడగునని తలచి మొసలిపై విభూతిని చల్లెను. మొసలి యథాప్రకారం ప్రాణము గలదై తనదారిన పోయెను.

పిమ్మట విక్రమాదిత్యుడు బ్రాహ్మణ పుత్రునితో రాజధానికి పోయెను. భట్టి మున్నగువారు ఆయన కెదురేగి అంతఃపురమునకు దీసుకొనిపోయిరి. వెంటనే వేదకోవిదుడను బ్రాహ్మణుని పిలిపించి బాలుని అతనికి అప్పగించెను. వేద కోవిదుడు తన కుమారుని చూచి బ్రహ్మానంద భరితుడై కౌగలించుకొని ముద్దు లాడెను. పిమ్మట విక్రమాదిత్యుని చూచి "మహారాజా! మీ దయవలన మర ణించిన నా కుమారుని తిరిగి పొందగలిగితిని. మీవంటి రాజులు ఇంతవరకు భూమిపై పుట్టలేదు. ఇకముందు పుట్టగలరను ఆశలేదు. భగవంతుడు మీకు దీర్ఘాయువును, శాశ్వతమైన కీర్తిని ప్రసాదించుగాక" అని ఆశీర్వదించి, కుమా రుని తోడుకుని సంతోషంగా పోయెను.

# చిలుకగామారి చిక్కులలో పడిన విక్రమాదిత్యుడు

ఉజ్జయినీ నగరమున విజయుడను నొక కంసాలి ఉండెను. అతడు విక్రమాదిత్యునితో మంచి స్నేహం కలిగియుండెను. విజయుడు తనకు తెలిసిన ఇంద్రజాల-మహేంద్రజాల విద్యలను విక్రమాదిత్యునకు ఉపదేశించెను. అందుకు ప్రత్యుపకారముగా విక్రమాదిత్యుడు తనకు తెలిసిన పరకాయ ప్రవేశ విద్యను విజయునకు నేర్పెను.

విక్రమాదిత్యుడు ఎక్కువకాలం విజయునితో గడుపుచుండెడివాడు. అయన అట్లుండుట భట్టికి ఎంతమాత్రము కిట్టకుండెను. విజయుడు నమ్మదగిన వ్యక్తి కాడని భట్టి అభిప్రాయము. అందుచే భట్టి విజయునితో ఎక్కువ స్నేహం కలిగియుండవద్దని విక్రమార్కునితో అనేకసార్లు చెప్పినాడు కాని విక్రమాదిత్యు డతని స్నేహము విడువకుండెను. భట్టి రాజు నేమియు అనలేక, విజయుని ప్రవర్తన నొక కంట కనిపెట్టుచుండెను.

ఇట్లు జరుగుచుండగా నొకసారి విక్రమాదిత్యుడు భట్టిని తీసుకొని పోకుండ ఆరు మాసములు అడవులలో సంచరించి వచ్చుటకు పోయెను. విక్రమాదిత్యుడు ఒంటరిగా అడవికి పోయిన సంగతి విని విజయుడు ఏదో పనిపై పరదేశమునకు పోవుచున్నట్లు ఇతరులకు చెప్పి విక్రమార్కుని అనుసరించి అడవులకు పోయెను. అతడినిచూచి రాజు ఆనందించి, "మిత్రమా! చాలా దినములకు కనబడితివి. క్షేమముగా ఉన్నావా? మంచి సమయమున వచ్చితివి. నీ వలన నాకు మంచిగా కాలక్షేపము కాగలదు" అని కౌగలించుకొనెను.

తరువాత వారు కొంతదూరము పోయి వేటాడి అలసిపోయిరి. అప్పుడు వారొక చెరువు వద్దకు వెళ్ళి దాహం దీర్చుకొనిరి. గట్టుపైనున్న ఒక చెట్టునీడను కొంతసేపు విశ్రమించదలచి విక్రమార్కుడు విజయుని తొడపై తల నుంచుకొని పరుండెను. కానీ రాజునకు నిద్ర పట్టలేదు. అచ్చటికి సమీపమున నున్న చెట్టు కొమ్మపై నొక గూడు ఉండెను. అందు రెండు చిలుకలు నివసించుచుండెను, ఒకటి మగచిలుక, రెండవది ఆడుది. అందు మగచిలుక ఏదో వ్యాధితో బాధపడి, బాధపడి అప్పుడే మరణించెను. అప్పుడు ఆడుచిలుక మగచిలుకపై

పడి ఏడ్చుచుండెను. ఆ దృశ్యమును విక్రమాదిత్యుడు చూచి చాల జాలిపడెను. ఆడుచిలుక దుఃఖము తీర్చవలెనని నిశ్చయించుకొని కంసాలివాడి తొడపై పరుండి నట్లుండి మంత్రధ్యానముచేసి తనకు తెలిసిన పరకాయ ప్రవేశ విద్య ననుసరించి తన జీవము నా మగచిలుక శరీరములో ప్రవేశపెట్టెను. ఆడుచిలుక తన భర్త బ్రతికినందుకు ఎంతో ఆనందించి కలసి మెలసి కాలం గడుపుచుండెను.



విజయుని తొడపై తల పెట్టుకొని పరుండి చెట్టుపై నున్న చిలుకలను చూచుచున్న విక్రమాదిత్యుడు

ఇది యంతయు విజయుడు గమనించెను. అతడు రాజును మోస గించుటకు ఇంతకంటె మంచి సమయం దొరకదని నిశ్చయించుకొని, రాజువద్ద నేర్చుకొన్న పరకాయ ప్రవేశ విద్య ప్రయోగించి తన జీవమును విక్రమాదిత్యుని దేహమున ప్రవేశపెట్టెను. వెంటనే తన శరీరమును కాల్చి బూడిద చేసెను. అచ్చటినుండి రాజు శరీరముతో ఉజ్జయినికి పోయెను.

విక్రమాదిత్యుని దేహముననున్న కంసాలి ఉజ్జయినీ నగరమును సమీపించి, కోటలోని కేగువారితో నేను నగరమునకు వచ్చినట్లు భట్టికి తెలియజేయుడని చెప్పగా వారు వేగముగపోయి ఆసంగతి భట్టికి తెలిపిరి. ఆ వార్త విని భట్టి ఎంతో ఆశ్చర్యపడెను. ఆరుమాసములు పూర్తికాకుండ రాజు అరణ్యవాసము ముగించి ఎన్నడును తిరిగిరాలేదు. ఇప్పుడు వచ్చినవాడు నా సోదరుడగు విక్రమాదిత్యుడై ఉండడు. ఇందేదో మోసమిమిడి యున్నది. అని కొంతసేపు ఆలోచించి యొక రాజభటుని పిలిచి విజయుడను కంసాలి నగరమందున్నాడో లేడో తెలుసుకొని రమ్మని పంపెను. రాజభటుడు తిరిగివచ్చి మహారాజుగారు నగరము విడిచి అడవులకు వెళ్ళిన మరునాడే విజయుడు ఊరువిడిచి వెళ్ళినట్లు తెలిసినదని చెప్పెను.

భట్టి ఆసంగతి తెలిసికొని ఏదో మోసము జరిగినదని నిశ్చయించుకొని వెంటనే చతురంగ బలములతో నగరము వెలుపలనున్న కపటవిక్రమాదిత్యుని వద్దకు వెళ్ళి ఘనస్వాగతమిచ్చి ఏనుగుపై కూర్చుండబెట్టినగరములోనికితోడ్కొని పోయెను. విజయుడు తననెవరును అనుమానించలేదని భావించి, లోలోపల ఎంతో ఆనందించుచుండెను. భట్టి లోనికిప్రవేశించిన రాజును దర్బారుకు తీసుకొని పోవలెనని ప్రయత్నించుచుండగా కపటవిక్రమాదిత్యుడు "భట్టీ! నేనిపుడు చాల అలసి

యున్నాను. నేడు అంతఃపురమున విశ్రాంతి తీసుకొని రేపు దర్బారు పనులు చక్కబెట్టదలచితిని" ననగా, భట్టి అట్లేకానిండని అతనిని కోటలోనికి తీసుకొని పోయెను.

పిమ్మట ఆయనను రాజుండు భవనమునకు పంపి జాగ్రత్తగా సేవలు చేయుచుండుడని భటులకాజ్ఞాపించి, వెలుపలికివచ్చి తన అంతరంగిక సేవకులను పిలిచి విజయుడు చేసిన మోసమునుతెలిపి జాగ్రత్తగ గమనించుచుండుడని తెలిపెను. తరువాత నొకచేటిని పిలిచి నీవంతఃపురమునకేగి నా మాటగా రాణులందరికి ఈ సంగతి చెప్పుము. "ఎవడో మనరాజును మోసముచేసి రాజు శరీరమున ప్రవేశించి వచ్చినాడు. ఆయన నివాసమునకెవరును పోవద్దు. ఒకవేళ శయనాగారమునకు రమ్మని పిలిపించిన మేమిపుడు గౌరీవ్రతము పట్టియున్నామను సంగతి మీకు తెలిసినదే! మీవద్దకు వచ్చిన వ్రతభంగమగును. అట్లయినమనకేగాక దేశమంతకు అరిష్టము కలుగును. వ్రతమిక మూడునెలలకు పూర్తికాగలదు. అప్పుడు మీవద్దకు వచ్చి మీకోరిక తీర్చగలము అని కబురుపంపుడు. మీరు మీ గృహములను విడిచి పోకుడు. అటుపైన చేయవలసిన పనులను నేను ఎప్పటికప్పుడు మీకు కబురు పంపుచుందును అని చెప్పుము. వారిని జాగ్రత్తగా కనిపెట్టి చూచుచుండుము" అని ఆజ్ఞాపించెను.

వెంటనే ఆచేటి అంతఃపురములోనున్న రాణులందరికి ఆ సంగతులు చెప్పి వారందరు మెలుకువగా ఉండునట్లు చేసెను. మరికొంతసేపైన తరువాత కపట విక్రమార్కుడు తనరాణులందరిని రమ్మని కబురుచేయగా, వారందరు భట్టి కబురుపంపినట్లు వ్రతము పూర్తికాగానే వచ్చెదమని చెప్పి పంపిరి. అంతట నా

కపటవిక్రమాదిత్యుడు ఆగ్రహము పొంది, భట్టిని పిలిపించి, రాణులవద్దకు పోయి తీసుకొని రమ్మనిచెప్పగా, భట్టి ఆశ్చర్యపడుచున్నట్లు నటించుచు "అన్నా! ఎన్నడు లేనిది మీరిట్లు రాణులను తీసుకొనిరమ్మని ఆజ్ఞాపించుచున్నారేమి? వారేమైన నేరము చేసినారా?" అని అడుగగా, "కాదుకాదు నేను నగరమునకు తిరిగివచ్చితిని కదా! వారిని మామూలు ప్రకారము నా శయనాగారమునకు రమ్మని కబురు చేసితిని దానికి వారు వ్రతమేదో చేయుచున్నామని, ఆవ్రతము యిక మూడు మాసములలో పూర్తియగునని, వ్రతము పూర్తికాగానే వచ్చెదమని చెప్పిపంపినారు. కనుక వారికి నచ్చజెప్పి నాశయన గృహమునకు వచ్చునట్లు చేయుము" అనగా, భట్టి "రాజా! మీమాటలు చిత్రముగా ఉన్నవి. చేతలుకూడ చిత్రముగనే ఉన్నవి. మీరు ఆరునెలలు అడవులలో సంచరించి వచ్చుచున్న సమయమున వారు వ్రతము ప్రారంభించి, మీరు తిరిగివచ్చునాటికి వారు వ్రతం పూర్తిజేయుచున్నారు. మీరు ఈసారి మూడుమాసములైనను పూర్తికాకముందే నగరమునకు తిరిగివచ్చినారు. కారణమేమో తెలియదు. వారు మధ్యలో వ్రతమువిరమించుట మనకుగాని, దేశ ప్రజలకుగాని శ్రేయస్సుకాదు. బాగుగా ఆలోచించి ఏమిచేయమందురో చెప్పుడు. అట్లేచేసెద"ననెను. భట్టి మాటలువిని కపటవిక్రమాదిత్యుడు రాణులను పంపమని పట్టుబట్టిన భట్టి అనుమానపడుటకు కారణమగునని, తనగుట్టు బట్టబయలగునని భయపడి "సరే! వ్రతము పూర్తియైన తరువాతనే రమ్మని కబురుచేయుము. ఇంతలో వచ్చిన తొందరలేదని చెప్పుము" అనెను. భట్టి 'అట్లే చేసెదనని' శలవు తీసుకొని వెళ్ళిపోయెను.

భట్టి క్రమముగా కపటవిక్రమాదిత్యుని ప్రవర్తన జాగ్రత్తగా గమనించి, అతడు తన అన్నయగు విక్రమాదిత్యుని శరీరము కలిగియున్న మరియొక

వ్యక్తి అని, ఆ వ్యక్తి విజయుడే అయివుండునని నిశ్చయించుకొనెను. అసలు విక్రమాదిత్యుని జీవమేమైనదో తెలియక చింతాక్రాంతుడయ్యెను. ఆయన జాడ తెలుసుకొనుటకు నలుదిక్కులకు గూఢచారులను పంపెను. అప్పుడప్పుడు తాను కూడ కొన్నిప్రాంతములకు పోయి వెదకి వచ్చుచుండెను.

ఇచ్చట యిట్లు జరుగుచుండగా, అడవిలో చిలుకయందు ప్రవేశించిన విక్రమాదిత్యుడు పెంటిచిలుకతో విహరించుచు, దానికి ఆనందము కలిగించుచు, కాలక్రమమున తన్నుతాను మరచిపోయెను. చిలుక రూపముననుండి అనేకఅద్భుత కార్యములు చేయుచుండగా ఆ యడవిలోనున్న వేలాది చిలుకలు అతనిని తమ రాజుగా యెన్నుకొని ఆచిలుక చెప్పినట్లు చేయసాగినవి. ఆ చిలుకలన్నిటితో కలిసి చిలుక రూపముననున్న విక్రమాదిత్యుడు అడవిలో ఆనందముగా కాలం గడుపుచుండెను.

ఇట్లు జరుగుచుండగా, ఒకనాడు ఆ ప్రాంతమునకు బోయవాడొకడు వచ్చెను. అతడు వేలాదిగనున్న చిలుకలను చూచి చాల సంతోషించి వాటినన్నిటిని పట్టుకొనవలెనని తలచెను. అట్టి తలంపుతో అతడు తనవద్దనున్న వలను చెట్టు చుట్టు పన్ని, అందుకొన్ని ఆహారపదార్థములు వేసి, దూరముగావెళ్ళి ఒక చెట్టు చాటున నక్కి ఉండెను.

కొంతసేపైన తరువాత ఆ చిలుకలన్నియు ఆడుతూ పాడుతూ మైమరచి వలలో వేటకాడుపెట్టిన ఆహారపదార్థములను భుజించవలెనను ఆశతో పోయి వలయందు చిక్కుకొన్నవి. ఆ చిలుకలతోపాటు చిలుకరాజైన విక్రమార్కుడు కూడ వలలో చిక్కుపడినాడు. వలలో చిక్కుకొన్న చిలుకలన్నియు

మొత్తము వెయ్యిసరిగా ఉన్నవి. వాటినిచూచి వేటకాడు ఎంతో ఆనందముగా అచ్చటికి వచ్చుచుండెను.

అతనిని చూచి చిలుకలు మిక్కిలి భయపడి ఏడువసాగినవి. విక్రమాదిత్యుడు ఆ చిలుకలను చూచి జాలిపడి "మిత్రులారా! విచారించి లాభము లేదు. నేనొక ఉపాయము చెప్పెదను. అట్లుచేసిన మనకు కలిగిన ఆపదను తప్పించు కొనవచ్చునని తోచుచున్నది. అది ఏమనగా– మనమందరము ఊపిరులు బిగబట్టి, కదలక మెదలక చచ్చినట్లు పడియుందము. వాడు మనలనుచూచి చచ్చిన చిలుకల వలన మనకు కలుగులాభమేమిటని తలచి వలనుండి తీసి క్రిందపడవేయును. వాడట్లు అన్నిచిలుకలను పడవేసిన తరువాత అందరము ఒక్కసారిగా ఎగిరి పోవలెను" అని చెప్పెను. చిలుకలుఅన్నియు మీరుచెప్పినట్లే చేసెదము అని ఊపిరులు బిగబట్టి, మెడలు వేలవేసి పడియున్నవి. ఇట్లున్న సమయమున వేట కాడు అచ్చటికివచ్చి చచ్చినట్లు పడియున్న చిలుకలను చూచి "ఇదేమి చిత్రము! చిలుకలన్నియు చచ్చియున్నవి. ఎంతో ఆశపడిన నాకు నిరాశదక్కినది. ఈ చచ్చిన చిలుకలను నేనేమి చేసుకొందును" అనుకొని ఒక్కొక్క చిలుకను తీసి, పరీక్షించి 'ఇది చచ్చినది, ఇది చచ్చినది' అనుచు క్రిందపడవేయసాగినాడు. ఇట్లాతడు తొమ్మిదివందల తొంభైతొమ్మిది చిలుకలను వలనుండి తీసి బయటపడ వేసినట్లు చిలుకలు లెక్కపెట్టినవి. మరియొక్క చిలుక మాత్రం ఉండిపోయినది. అది చిలుకరూపముననున్న విక్రమాదిత్య మహారాజు. అన్నిటిని తీసివేసిన తరు వాత వేటకాడు ఆ చిలుకను తీయబోవుచుండగా అతని మొలయందున్న కత్తి జారి క్రిందపడినది. దాని చప్పుడువిని చచ్చినట్లు పడియున్న చిలుకలు మొత్తము వెయ్యిచిలుకలను వేటకాడు క్రిందపడవేసినాడనుకొని తివ్వుతివ్వుమని పైకి ఎగిరి

పోయినవి. విక్రమాదిత్యుని జీవముగల చిలుక మాత్రము అతని చేతిలో ఉన్నది. చిలుకలన్నియు ఎగిరిపోవుటను చూచి వాడు ఆగ్రహమును, ఆశ్చర్యమును పొందినాడు. 'ఈచిలుకలు నన్నెంత మోసగించినవి! అవిచేసిన మోసమునకు దీని మెడ నులిమి చంపినంతవరకు నాకోపము తీరదు' అని మిగిలిన చిలుక మెడనులిమి చంపుటకు సిద్ధపడుచుండగా, చిలుక రూపముననున్న విక్రమాదిత్యుడు "ఓయీ! ఆ చిలుకలు పారిపోయినందుకు విచారించకుము. అవి అడవిచిలుకలు. వాటి వలన నీకు కలుగు లాభమంతగాఉండదు. వాటినన్నిటిని అమ్ముటవలన నీకు అయిదారు వరహాలుకంటె ఎక్కువరావు. నేను నీకు వెయ్యివరహాలు వచ్చునట్లు చేయుదును. నన్ను చంపకుము" అని చెప్పుచుండగా బోయవాడు ఆశ్చర్యపడి చిలుక నట్లే చూచుచుండెను. తరువాత అచిలుక మరల యిట్లు చెప్పెను. "నీవు నన్ను ఏదైన పట్టణమునకు తీసుకొనిపోయి ధనవంతులకు చూపించుము. వారు నిన్ను వెల ఎంతని అడుగుదురు. అప్పుడు నీవు ఈచిలుక సామాన్యమైనది కాదు. చక్కగా మాట్లాడగలదు. అవసరమైనచో తగుసలహాలు కూడ యివ్వగలదని చెప్పుము. వారు కొనుటకు సందేహించిన నేను నచ్చజెప్పి వేయివరహాలకు కొనునట్లు చేయుదును" అని చెప్పెను.

చిలుక చెప్పిన మాటలువిని బోయవాడు దీనిని చంపుటవలన కలుగు లాభమేమి? పాపము మాత్రము లభించును. ఇది చెప్పినట్లు చేయుటవలన కొంతైన లాభము కలుగవచ్చుననుకొని, చిలుకను చంపక ఒక పట్టణమునకు తీసుకొనిపోయెను. అచ్చట ధనవంతులు నివసించుచుండు వీధులలో తిరుగుచు "రామ చిలుక! రామచిలుక! అందమైన రామచిలుక! మాట్లాడే రామచిలుక! మహామంచి రామచిలుక!" అని కేకలు వేస్తున్నాడు. అనేకమంది స్త్రీపురుషులు అతని కేకలు

విని ఇండ్లనుండి బయటికి వచ్చి "ఈచిలుక మాట్లాడుతుందా? అయితే దీని ఖరీ దెంత?" అని అడుగసాగినారు. అతడు వారికా చిలుకవెల వెయ్యివరహాలు అని చెప్పగా "అబ్బా! అంతవెలా?" అంటూ వెనుకకు పోసాగినారు. వేటకాడు వీధు లన్నీ తిరిగి ఎంతో అలసిపోయినాడు. రూపాయి, రెండురూపాయలకు అమ్ముడు పోయే చిలుకను వెయ్యివరహాలకు ఎవరుకొంటారు. ఈ చిలుక నన్ను మోసగించ టానికే అలాచెప్పమని ఉంటుందని భావించి నిరాశపడ్డాడు. చిలుకను కోపంగా చూడసాగాడు. చిలుక అతనినిచూచి "ఓయీ! నిరాశపడకు. నీవు చెప్పిన వెలకు అమ్ముడుపోయేలా చూస్తాను. మరొకవీధికి తీసుకొనివెళ్ళి గట్టిగా కేకలు వెయ్యి" అని చెప్పింది.

చిలుక చెప్పిన ప్రకారం వాడు మరొకవీధికి వెళ్ళి అరువనారంభిం చాడు. అ సమయమున నాపట్టణవర్తకులలో శ్రేష్ఠుడైన మాణిక్యశెట్టి యింటిలో నుండి బయటకువచ్చి "చిలుక నెంతకిస్తావురా?" అని అడుగగా వాడు "వెయ్యి వరహాలకిస్తాను" అన్నాడు. అదివిని ఆశెట్టి "చిలుకేమిటి? వెయ్యివరహాలేమిటి? నీకేమైనా మతిపోయిందా?" అని అడిగినాడు.

శెట్టి మాటలువిని చిలుకగా ఉన్న విక్రమాదిత్యుడు "శెట్టిగారూ! నా మాటవిని ఇతనికి వెయ్యివరహాలు యిచ్చికొనుడు. నావలన మీకు వేయింతలు లాభము కలుగునట్లు చేసెదను. ఏమాత్రం సందేహించక కొనుడు" అని చెప్పగా మాణిక్యశెట్టి మిగులఆశ్చర్యపడి "ఇది మనుష్యులకంటె ఎంతోచక్కగా మాట్లాడు చున్నది. ఇటువంటి చిలుకను నేనెన్నడూ చూడలేదు. దీనివలన లాభం ఉన్నను లేకపోయినను చూచినవారికి ఆనందం కలుగును. ఇట్టిచిలుక నాయింట వున్న

ఊరిలో వున్న వారందరు మెచ్చుకొందురు" అనుకొని వెయ్యివరహాలు యిచ్చి ఆ చిలుకను తీసుకొనెను. బోయవాడు చిలుక తనకు చేసిన సహాయమునకు మిక్కిలి సంతోషించి, తన గృహమునకు పోయెను.

మాణిక్యశెట్టి తన కుమారుడగు సోమసుందరశెట్టికొక దుకాణమును క్రొత్తగా పెట్టెను. మనిషివలె చక్కగా మాట్లాడుచున్న ఆ చిలుకను తన దుకాణమున ఉంచిన దానిని చూచుటకైనను తన దుకాణమునకు అనేకమంది రాగలరని తలచి తండ్రికి నచ్చజెప్పి సోమసుందరుడా చిలుకను ఒక అందమైన పంజరములో నుంచి దుకాణంముందు ఉంచెను.

ఆనాటి నుండి చిలుక దుకాణమునకు వచ్చినవారిని "అయ్యా! మీకేమి కావలెను?" అనియడిగి వారికి కావలసిన సామానులుయిమ్మని పనివారికి చెప్పి యిప్పించుచు, సరసమైన ధరలుచెప్పి సరకు అమ్మునట్లు చేయుచుండెను. దాని ప్రవర్తన ఈనోట ఆనోట పట్టణములోని వారందరికి తెలిసిపోయినది. వారు దూరమని భావించక తమకు అవసరం లేకపోయినను ఆ దుకాణమునకు వచ్చి సరకులు కొనుచు, చిలుక మాటలువిని ఆనందించుచు వెళ్ళసాగిరి. అందువలన సోమసుందరశెట్టి దుకాణమునకు స్వల్పకాలములో విశేషలాభము వచ్చెను.

చిలుక కారణముగా తమ దుకాణమునకు విశేష లాభము, గొప్ప పేరు లభించుచున్నందున శెట్టి కుటుంబములోనివారు దానిని తమ అదృష్టదేవతగా భావించి, ఎంతో ప్రేమగా పెంచుచుండిరి.

ఆ పట్టణంలో సుందరియను నొకవేశ్య ఉండెను. దానితో సరససల్లాపములాడుచు హాయిగా కాలము గడుపుటకై పట్టణములోగల ధవంతులనేకులు పోవుచుండిరి. అట్టివారిలో సోమసుందరశెట్టి ఒకడు.

రాజంతటివారు కూడ తనస్నేహము కోరివచ్చుచున్నందున సుందరికి విపరీతమైన గర్వం కలిగినది. విపరీతమైన ధనదాహము కలిగినది. దానికి రాజు వద్ద చాలాచనువు ఉన్నది. అది ఎవరిని ఏదికావాలని కోరినా యివ్వవలసిందే. లేకుంటే వారిమీద ఏవేవో నేరములు చెప్పి రాజుతో శిక్షవిధింపజేసేది. అందువల్ల అందరూ భయపడుతుండేవారు. అది ఏదికావాలంటే అది కిమ్మనకుండా యిచ్చే వారు. ఆ పట్టణంలో అది ఆడిందిఆట, పాడిందిపాటగా సాగిపోతున్నది.

ఇలా జరుగుతూ ఉండగా ఆ వేశ్యకు మాట్లాడుతున్న చిలుక గురించి తెలిసింది. అటువంటి చిలుక తనవద్ద మాత్రమే ఉండాలనుకొన్నది. అది సోమ సుందరశెట్టి దుకాణమున ఉన్నదని తెలుసుకొన్నది. అతడు నా మిత్రుడే. నేను కావాలంటే యివ్వకుండా ఉండడు. ఇవ్వకపోతే రాజుతో చెప్పి శిక్షింప జేస్తాను. అని తలచి, తన చెలికత్తె నొకదానిని శెట్టి వద్దకు పంపింది. ఆ చెలికత్తె శెట్టి దుకాణమునకు వచ్చి "సేట్‌గారూ! మా యజమాను రాలు సుందరి మీకు బాగా పరిచయమున్న వేశ్యారత్నం. ఆమె మీవద్ద వున్న చిలుకను తెచ్చి తనకు యిమ్మని చెప్పమన్నది. దీనికి మీరు ఏమంటారు?" అని చెప్పింది.

పంజరంలోని చిలుక ఆ మాటలువిని "శెట్టిగారూ! ఆ నీచురాలివద్దకు నన్ను పంపకుడు. పడుపువృత్తి చేసుకొనే ఆ ముండకు నాఅవసరం ఏమొచ్చింది? నన్ను ఆసరా చేసుకొని మరింతమంది విటులను ఆకర్షించి ధనం సంపాదించా లనుకొంటున్నదేమో? అటువంటి పాపిష్టిదానింట నేను ఉండను. నన్ను ఎంత మాత్రం దానివద్దకు పంపకండి" అని పలికింది. చిలుకమాటలు విని ఆ చెలికత్తె బోయింది. తన యజమానురాలిని దూషించినందుకు ఆగ్రహం పొందింది.



దుకాణమునందు పంజరములోనున్న చిలుక సుందరి చెలికత్తెను చూచి దూషించుట

గబగబ సుందరి వద్దకు వెళ్ళి చిలుక అన్నమాటలన్నీ చెప్పింది. ఆ మాటలువిన్న సుందరి ఆగ్రహం పట్టలేకపోయింది. "దానినెట్లయినను చంపి తినకున్న నాపేరు సుందరేకాదు" అద ప్రతిజ్ఞచేసింది. వెంటనే ఆ చిలుకను పంపకున్న రాజుతో చెప్పి శిక్ష విధింపజేస్తాను. నిన్నుకూడ ఇకముందు నా గుమ్మం తొక్కనీయను. వెంటనే ఏ సంగతీ తెలియజేయవలసిందని చెలికత్తెతో సోమసుందరశెట్టికి కబురు చేసింది.

ఆ కబురు విని శెట్టి గజగజ వణకిపోయాడు. చిలుకను పంపడం అతనికి ఎంతమాత్రం యిష్టంలేదు. కాని దానితో స్నేహంగా ఉండాలన్నా, శిక్షనుండి తప్పించుకోవాలన్నా చిలుకను పంపక తప్పదు. అని నిశ్చయించుకొని. తన దుకాణములోనున్న పంజరమును చెలికత్తెకుయిచ్చి వేశ్యకు పంపాడు.

చెలికత్తె తెచ్చిన పంజరములోని చిలుకను చూచి సుందరి పట్టరాని కోపముతో "ఇది నన్ను చాల అవమానించి నానా దుర్భాషలాడినది. కనుక ఈ చిలుకను చంపి, దీని మాంసము వండి పెట్టుము. అంతవరకు నాకు నిదురపట్టదు" అని ఆజ్ఞాపించెను.

తన యజమానురాలి ఆజ్ఞ వినిచెలికత్తె ఆ పంజరమునులోనికి తీసుకొని పోయి,దానిని చంపదలచి పంజరమునుండి బయటకు తీసెను.అపుడువిక్రమార్కుడు "ఇదేసమయం. ఆలసించిన ప్రాణమునకు ముప్పువచ్చును. ఎట్లయినతప్పించుకొని పోవలె"నని తలచి రెక్కలను టపటపకొట్టి, గోళ్ళతో ముక్కుతో ఆమె ముఖము మీదను, చేతులపైనను గట్టిగా రక్కెను. చెలికత్తె ఆ బాధకు ఆగలేక చిలుకను విడిచిపెట్టెను. చిలుక తప్పించుకొని ఆకశమునకు ఎగిరిపోయెను. అట్లు పోయి ఆ పట్టణమున గల విష్ణాలయము వద్దనున్న చిలుకలతో కలిసి పోయెను.

చెలికత్తె చిలుక పారిపోయినందుకు సుందరి బాధించునని భయపడి, వేగముగా ఒక పక్షిని కొనితెచ్చి, దానిని చంపి, దాని మాంసము వండి సుందరికి పెట్టెను. సుందరి అది చిలుక మాంసమే అని నమ్మి పూర్తిగాతిని, "నాపంతము చెల్లించుకొంటిని" అని తలచి సంతోషించెను.

మరునాడు సుందరి పువ్వులు, పండ్లు మొదలగునవి దీసుకొని విష్ణా

లయములోనికి పోయెను. ఆమెను చూచి చిలుక రూపమునున్న విక్రమాదిత్యుడు కూడ గుడిలోకి పోయి గర్భగుడికి సమీపమునున్న స్తంభమునెక్కి ఆమె చర్యలను గమనించుచుండెను.

సుందరి ప్రతి శనివారమునాడు ప్రతి ఏకాదశినాడు, పర్వదినములలోను తప్పక విష్ణాలయమునకు పోయి విశేష పూజలు చేయించుచుండెను. అట్లే ఆనాడు కూడ పూజలు జరిపించెను. గర్భగుడి చుట్టు మూడుసార్లు ప్రదక్షిణము చేసి స్వామి ఎదుట చేతులు జోడించి నిలబడి "స్వామీ! నాయందు దయవుంచి మోక్షం ప్రసాదించుడు. ఎంత కూర్చొని తిన్నను తరుగనంత ధనము సంపాదించితిని. నాకు ధన ధాన్యముల కొరతలేదు. ముక్తి ననుగ్రహించినదే చాలు!" అని కోరుకొని, తరువాత యింటికి పోయెను.

చిలుకరూపమున నున్న విక్రమాదిత్యుడు ఆమె మాటలన్నియు విని, దీనికి తగిన శాస్తి చేయుట కిప్పుడు మంచిమార్గము దొరికినది అనుకొని సంతోషముతో వెళ్ళి మిగిలిన చిలుకలతో కలిసిపోయి ఆనందముగా గడుపుచుండెను.

పిమ్మట ఒకనాడు సుందరి మామూలు ప్రకారము దేవుని పూజించుటకై విష్ణాలయమునకు వచ్చుచుండెను. ఆమె రాకకై ఎదురుచూచుచున్న చిలుక వేగముగా గుడిలోకిపోయి, విష్ణుదేవుని విగ్రహము వెనుక నక్కిఉండెను. మరికొంతసేపటికి సుందరి గుడిలోకి వచ్చి భక్తిశ్రద్ధలతో దేవుని పూజించి, స్వామి యెదుట నిలబడి తనకు ముక్తి ప్రసాదించమని కోరుచుండెను. అప్పుడు చిలుక రూపముననున్న విక్రమాదిత్యుడు "సుందరీ! నీ గుణగణములకు మెచ్చితిని నీవు నన్ను చాలకాలము నుండి భక్తిశ్రద్ధలతో పూజించుచున్నావు. నీ భక్తికి

మెచ్చితిని. నిన్ను బొందితో వైకుంఠమునకు పంపెదను. వచ్చే శనివారము నాడు నీ గురించి వైకుంఠమునుండి దివ్యరథము రాగలదు. ఈలోపుగా నీవు నీ సంపాదన నంతను పేదసాదలకు పంచిపెట్టవలెను. దేహాభిమానమును వదలి, గుండు చేయించుకొని, నామము పెట్టించుకొని, కాషాయవస్త్రములు ధరించి రాత్రిం బగళ్ళు భజనలు చేయవలెను. శనివారము సాయంత్రము సరిగా 5 గంటలకు వైకుంఠమునుండి దేవ విమానము వచ్చును. అది సరిగా ఈగుడిముందు ఆగును. అది వచ్చులోపుగా నీవు బాజాభజంత్రీలతో, భజనలతో ఊరేగుతూ యిచ్చటికి వచ్చి సిద్ధముగా ఉండుము. విమానం రాగానే నీవు ఎక్కికూర్చుండవలెను. అయిదు నిమిషములకంటె అది ఎక్కువసేపు ఉండదు. ఇవిఅన్నియు జాగ్రత్తగా వింటివి కదా! ఇక సంతోషముగా ఇంటికిపోయి, ఆ విధముగా చేయుము. భూలోకమున నీవంటి పుణ్యాత్ములు, అదృష్టవంతులు లేరు" అని చెప్పెను.

చిలుక చెప్పిన మాటలన్నియు విష్ణుదేవుడే చెప్పినాడని సుందరి నమ్మి, స్వామికి సాష్టాంగదండ ప్రణామములాచరించి "దేవదేవా! ఈ దీనురాలిపై ఇంత కాలంనకు దయకలిగినదా స్వామీ! మీ అనుగ్రహము పొందిననేను ఎంతోఅదృష్ట వంతురాలిని. మీరు చెప్పినట్లే చేసెదను" అని పదేపదే చెప్పి సంతోషముగా ఇంటికి పోయెను.

దేవుడు తనకు బొందితో వైకుంఠము పోవునట్లు చేయుటకు వరమిచ్చి నందుకు సుందరి పట్టరానంత సంతోషము కలిగి, మరునాడు ఉదయమే లేచి చక్కగాముస్తాబై పల్లకిలో కూర్చుండి మహారాజువద్దకు పోయెను. సుందరి వచ్చి నందుకు రాజు ఎంతో ఆనందించి వేళకానివేళ ఇంత అకస్మాత్తుగా వచ్చిన కారణ

మేమిటి? అని అడుగగా, సుందరి జరిగిన సంగతులన్నియు చెప్పి నేను బొందితో వైకుంఠమేగు వేడుకను చూచుటకు దేశ విదేశములలోనున్న రాజులందరినీ పిలి పించమని, తమరాజ్యములోనున్న వారందరికి ఆవిషయము తెలియునట్లు చాటింపు వేయించమని కోరెను.

రాజును, మంత్రియు ఆసంగతి విని ఎంతో ఆనందించి "నీ వంటి అదృష్టవంతు లెచ్చటనులే"రని మెచ్చుకొని. "నీవు కోరినట్లు తప్పకచేయుదుము. నీవలన నాకును, మనరాజ్యమునకు గొప్పపేరు కలుగునుగదా!" అని అంగీకరించి, వెంటనే దేశదేశములకు ఆవార్త పంపిరి. ఆయాదేశముల రాజులందరిని ఆహ్వా నించిరి. తమ రాజ్యమంతటా చాటింపు వేయించిరి.

పిమ్మట సుందరి తన బంధుమిత్రులనందరిని పిలిపించి, తాను బొందితో వైకుంఠమునకేగి భగవంతుని సన్నిధినుండుటకు వరం పొందినానని, తనను తోడ్కొనిపోవుటకు శనివారం సాయంత్రం అయిదుగంటలకు విష్ణుదూతలు దివ్య విమానం తీసుకొనివత్తురని జరిగిన సంగతులన్నియు చెప్పెను. ఆ వార్త విని ఆ బాలవృద్ధులు ఆమె గొప్ప అదృష్టవంతురాలని కొనియాడి, ఆవేడుకచూచుసమయ మెప్పుడు వచ్చునా అని నిరీక్షించసాగిరి.

ఇంతలో శనివారం రానేవచ్చినది. ఈ లోపుననే ఆమె యిండ్లు, భూములు, వాహనములు, నగలు మొదలగువానినన్నిటిని అమ్మి విశేషధనము ప్రోగుచేసి ఆ ధనమంతయు పేదసాదలకు దానంచేసినది. తల గొరిగించుకొని కాషాయవస్త్రములు ధరించి రాత్రింబగళ్ళు భజనలు చేయించుచు కాలం గడిపెను. దేశదేశముల నుండి ఆ వేడుకచూచి ఆనందించవలెనని రాజులు, పట్టణ ప్రజలు

లక్షలాదిగ వచ్చి గుడిచుట్టును చేరిరి. ఆ వింతచూచి ఆనందించవలెనని, విక్రమా ర్కుని జాడ తెలుసుకొనదలచి దేశదేశములు తిరుగుచున్న భట్టి కూడ వచ్చి ఒక చోట నిలబడెను. భట్టినిచూచి చిలుక రూపముననున్న విక్రమాదిత్యుడు గుర్తించి ఎంతో ఆనందించుచుండెను.



సుందరి కాషాయ వస్త్రములు ధరించి, తలగొరిగించుకొని, నామము పెట్టుకొని
భజన చేయుచు వచ్చి ధ్వజస్తంభము వద్ద నుండుట
ధ్వజస్తంభము మీద కూర్చుని చిలుక మాట్లాడుట

మరికొంత సేపటికి సుందరి బాజాభజంత్రిలతో, భజనబృందముతో గుడికి వచ్చెను. అప్పటికి నాలుగున్నర గంటలైనది. మరియొక అరగంటలో దివ్య విమానము వచ్చునుకనుక ఈలోపుగా స్వామిని దర్శించవలెననుకొని సుందరి గుడి లోనికిపోయి "స్వామీ! మీఆజ్ఞను తు.చ. తప్పక నెరవేర్చితిని. దయయుంచి దివ్యవిమానమును రప్పించి నన్ను బొందితో వైకుంఠము చేర్పుడు." అని ప్రార్థించి గుడిబయటకు పోయి విమానం రాకకు ఎదురు చూడసాగెను.

నాలుగున్నర దాటినది. అయిదు అయినది. అయిదుంపావు అయినది. అయిదున్నర కూడా అయినది. కాని విమానంరాలేదు. విమానం రాకకు సుందరి ఆతృతగా ఎదురుచూస్తున్నది. ఆమెతోపాటు దేశ దేశముల నుండి వచ్చిన లక్షలాది ప్రజలు ఆకాశంవైపు చూడసాగినారు. సుందరి నిమిషమొక యుగంవలె గడుపుచున్నది. క్రమంగా ఆరుగంటలైంది. విమానం రాలేదు.

సుందరి నిరాశపడి ఆకాశంవైపు చేతులు జోడించి, "భగవంతుడా! నాయందు అనుగ్రహముంచి ఇకనైనా విమానమును పంపుము. నన్ను నీ సన్నిధికి త్వరగా రప్పించుకొనుము" అని ప్రార్థించుచుండగా, చిలుక రూపముననున్న విక్రమాదిత్యుడు జివ్వుమని ఎగిరివచ్చి ధ్వజస్తంభము మీదనిలచి "ఓసీ! పాపిష్టిదానా! నీవుచేసిన పాపములకు బహుమతిగా భగవంతుడు నీకు దివ్యవిమానము పంపుతానని చెప్పినాడా? అనేకమంది కొంపలుకూల్చిన కులటవగు నీకు మోక్షమిచ్చెదనన్నారా? సోమసుందరశెట్టి దగ్గర సుఖముగా బ్రతుకుచున్న నన్ను చంపి, నా మాంసం తిని సంతోషించాలని ప్రయత్నించావు. నీ గర్వానికి తగిన ఫలితం యిప్పుడు అనుభవించు. నీపూజలకు మెచ్చి భగవంతుడు నీకు విమానం పంపిస్తా

డనుకొన్నావు. బొందితో వైకుంఠానికి వెళ్ళాలనుకొన్నావు. నీకు తగినశాస్తి చేయాలని దేవుడు చెప్పినట్లు నేనే అలాచెప్పాను తెలిసిందా? వెళ్ళు. వైకుంఠానికి వెళ్తావో, వల్లకాటికి వెళతావో, వెళ్ళు! విమానం వస్తుందన్నమాట అబద్ధం. ఇక గుండుకు సున్నంబొట్లు పెట్టుకొని ఊరేగు! నిన్ను చూచిన తరువాత మిగిలిన వేశ్యలైనా కొంచెం బాగుపడతారు" అని పలికి, భట్టి భుజముపై వాలింది. ఇతరులకు తెలియకుండ "సోదరా! నాజీవము ఈచిలుకలో చిక్కియున్నది. నీతో తీసుకొనిపొమ్ము" అని చెప్పెను.

ఆ చిలుకపలుకులు విని అచ్చటికి వచ్చిన లక్షలాది ప్రజలు సుందరిని ఎగతాళి చేసిరి. 'వేలాది కొంపలుముంచి, సంసారములు పాడుచేసిన వేశ్యకు వైకుంఠం వస్తుందా?' అని నిందించసాగిరి. వారి ఎత్తిపొడుపు మాటలు భరించలేక ఊరిలోనివారికి ముఖంచూపించలేక సుందరి నేలపైపడి, తలకొట్టుకొని ప్రాణం విడిచింది. నలుగురు నాలుగురకాల చెప్పుకొంటూ, నవ్వుకొంటూ, చిలుక దానికి బాగా బుద్ధిచెప్పింది అనుకొంటూ ఎవరిదారిని వారుపోయారు.

భట్టి భుజముమీద కూర్చున్న చిలుకను ఆ ఊరి రాజు తనకు ఇమ్మని కోరినాడు. సోమసుందరశెట్టికూడ యిమ్మని అడిగినాడు. అంతట భట్టి ఆ చిలుక విక్రమాదిత్య మహారాజుదని, దాన్ని వెదకుటకే తానా ఊరు వచ్చినట్లు, యివ్వనందుకు అన్యథా భావించవద్దని చెప్పినాడు. విక్రమాదిత్యునిపేరు విని భయపడి రాజు మారు మాటాడక భట్టిని ఉచితరీతిని గౌరవించి సాగనంపినాడు.

పిమ్మట భట్టి చిలుకరూపమున నున్న విక్రమాదిత్యుని అతి రహస్యముగ ఉజ్జయినికి తీసుకొనిపోయి, అంతఃపురములోనున్న ఒక రహస్యమయిన

స్థలములో ఉంచెను. రాజు శరీరములో ప్రవేశించియున్న కంసాలి జీవమును బయటికి పంపి, చిలుక శరీరములోనున్న విక్రమాదిత్యుని జీవమును ఆయన నిజ శరీరములో ప్రవేశపెట్టు విధమును గూర్చి రాత్రింబగళ్ళు తీవ్రముగ ఆలోచించి, తుదకు ఒక ఉపాయమును పన్నెను. తన ఆలోచనను చిలుకరూపముననున్న అన్నగారికి చెప్పగా, ఆయన "అట్లే చేయుము. నీ యుపాయము అద్భుతముగా నున్న"దని పలికెను.

అంతట భట్టి అంతఃపురములోగల రాణుల వద్దకువెళ్ళి కపట విక్రమాదిత్యునకు వ్రతము పూర్తియైనట్లు కబురు పంపుచున్నానని, అతడు ఒకవేళ మిమ్ము చూచుటకు వచ్చినయెడల "వ్రతము పూర్తియైన తరువాత రోజున రాజు తరపు ఒక మేకపోతును, రాణుల తరపున ఒక మేకపోతును తెచ్చి ఆ రెండింటిని పోట్లాడింతురని రాజు తరపు మేక గెలిచిన వెంటనే తనకు యిష్టమైన రాణుల వద్దకు పోయి ఉండవచ్చుననీ, అట్లుగాక రాణుల తరపు మేక గెలిచిన ఆరునెలలు తరువాత మాత్రమే అంతఃపురములోనికి పోయి రాణులను కలిసికొను అవకాశము కలదని, ఇది మొదటినుండీ ఉన్న ఆచారమనీ చెప్పి పంపుడు" అని బోధించెను.

రాణుల వ్రతము పూర్తియైనదన్న వార్త విని విజయుడను కంసాలి ఎంతో ఆనందించి, భట్టిని వెంటబెట్టుకొని అంతఃపురమునకు పోయి రాణులను పలుకరించబోగా వారందరు భట్టి చెప్పినట్లు చెప్పిరి. విజయుడు ఆ సంగతి మరచి వచ్చితినని, మరునాడు మేకపోతుల యుద్ధము జరిపించెదమని చెప్పి అచ్చటనుండి వెళ్ళిపోయెను.

విజయుడు తన నివాసమునకు పోయి భట్టిని చూచి "మహామంత్రీ! వ్రతము పూర్తి అయిన తరువాత యిట్టి ఆచారము ఉన్నదని నాకు చెప్పలేదేమి?" అని అడుగగా భట్టి "మహాప్రభూ! నాకా విషయము జ్ఞాపకము రాలేదు. అందుచే చెప్పలేకపోయితిని. మీకు వృధాశ్రమ కలిగించినందుకు క్షమించుడు" అనికోరెను. అప్పుడు విజయుడు "సరే కానిమ్ము. ఇప్పుడు మన తరఫున పోట్లాడుటకు ఒక మేకపోతు కావలెనుగదా! అది రాణుల తరపున ఉండే మేకపోతును అవలీలగా జయించగలనై ఉండవలెను. అట్టి మేకపోతును నీవు స్వయముగా చూచి తీసుకు రావలెను. ఎంత ధనమయినను వెనుకాడక కొనితెమ్ము" అని ఆజ్ఞాపించెను.

భట్టి విజయుని మాటలు విని "రాజా! మీరు ఇంతగా చెప్పవలెనా? మంచి బలముగల మేకపోతును కొనితెచ్చెదను. మీరు నిశ్చింతగా ఉండుడు. మీ ఓటమి నా ఓటమి కాదా?" అని పలికి, మెప్పించి, అచ్చటినుండి వెళ్ళిపోయెను. తన సేవకులను పంపి బాగుగా బలిసిన ఒక మేకపోతును తెప్పించి ఉంచెను. భట్టి అంతకుముందే రాణులతరపున పోట్లాడుటకొక మేకపోతును తెప్పించెను. అది అనేక మేకలతో పోరాడి జయించినది. చాల పౌరుషం గలది. కాని రాజు తరపున పోట్లాడుటకు తెప్పించిన మేకపోతుకంటె సన్నముగా ఉన్నది. గట్టిగా నిలబడి పోట్లాడగల శక్తి లేనట్లు ఉన్నది.

విజయుడు ఉదయమేలేచి భట్టికి కబురు పంపినాడు. భట్టి కొనితెచ్చిన మేకపోతును తీసుకొనివచ్చి రాజుకు చూపించినాడు. రాజు ఆమేకను చూచి "మంచి బలంగానే ఉన్నది. రాణుల తరపున పోట్లాడే మేకపోతుకు కూడ చూడాలని ఉంది" అన్నాడు. భట్టి అతనిని తీసుకొని వెళ్ళి ఆ మేకను చూపించినాడు.

దానిని చూచి విజయుడు "మనమేకపోతుముందు అది నిలబడటానికికూడ తగినట్లు లేదు. మన మేకపోతే గెలుస్తుంది. సందేహంలేదు." అనుకొని సంతోషముగా తన నివాసమునకు వెళ్ళినాడు.

ఉదయం పదిగంటలకు మేకల పోట్లాటకు అన్నిఏర్పాట్లూ చేయబడ్డాయి. ఒక ప్రత్యేక స్థలంలో రాజు, మంత్రులు, సేనానాయకులు. పురుషులు ఒకప్రక్క కూర్చున్నారు. రాణులు, పిల్లలు, పురకాంతలు ఒకప్రక్క కూర్చున్నారు. సరిగా పదిగంటలకు రాజుతరపు మేకపోతును, రాణులతరపు మేకపోతును ఒకదానిమీద కొకదానిని ఉసికొల్పి రంగంలో వదిలారు. రాణుల తరపు మేకపోతు రాజుతరపు మేకపోతుపై విజృంభించి పోరాడసాగింది. దానిముందు నిలువలేక రాజు తరపు మేకపోతు వెనుకకు వెనుకకు పోతున్నది. అది చూచి విజయుడు తన మేక ఓడిపోయే స్థితిలో ఉందని గ్రహించి భయపడసాగినాడు. అది ఓడిపోతే 'ఆరునెలలవరకు రాణుల ముఖం చూడటానికి వీలులేదుకదా!' అని భయపడుతున్నాడు. అతడు ఆతృతగా చూస్తున్నాడు. తన మేకపోతు నెలాగయినా గెలిపించాలనుకొంటున్నాడు. ఇంతలో రాణుల తరపు మేకపోతు రాజు తరపు మేకపోతును తరిమి తరిమి, పొడిచి చంపింది. అది గమనించిన విజయుడు ఆ మేక నెలాగయినా బ్రతికించి గెలిపించాలనే నిశ్చయంతో సింహాసనముపై నిద్రపోవుచున్నట్లు నటించి తనకు తెలిసిన పరకాయ ప్రవేశ విద్యాప్రభావంతో తన జీవమును మేక శరీరములో ప్రవేశపెట్టినాడు. అప్పుడు చనిపోయిన మేకపోతు పైకిలేచినది. దానినిచూచి భట్టి వెంటనే తనవద్ద భద్రముగా దాచిన చిలుకను పైకితీసి "అన్నా! వెంటనే నీ శరీరమున నీ జీవమును చేర్చుము. ఆలస్యమేమా

త్రము చేయకుము" అని హెచ్చరించగా చిలుక శరీరముననున్న విక్రమాదిత్యుడు సింహాసనముపైనున్న తన నిజదేహములో ప్రవేశించి, సింహాసనముపై కూర్చుండెను.



ఒకప్రక్క రాజు మున్నగువారు మరియొకప్రక్క రాణులు వారిమధ్య మేకలయుద్ధం

అది చూచి భట్టి బ్రహ్మానందభరితుడయ్యెను. వెంటనే విజయుని జీవముతోనున్న మేకపోతునుపట్టి చంపించెను. విజయుడు తన జీవమును ప్రవేశపెట్టుటకు మృతదేహమేదియు లేక దుర్మరణము పొందెను.

విక్రమాదిత్యుడు తిరిగి తన దేహమును పొందినందుకు ఎంతో ఆనందించి, భట్టిని, రాణులను వెంటబెట్టుకొని మహంకాళిని దర్శించి, అనేక విధముల స్తుతించెను. విశేష పూజలు జరిపించెను. దేవి అతని భక్తికి మెచ్చి ప్రత్యక్షమై తీర్థ విభూతుల నిచ్చి ఆశీర్వదించెను.

# సద్గుణవతిని కాపాడిన విక్రమాదిత్యుడు

విక్రమాదిత్యుడు ఒకనాడు భేతాళుని పిలిచి "నీవుపోయి భూలోకమున జరుగు విశేషములను చూచి వచ్చి చెప్ప"మనెను. భేతాళుడు వెంటనే భూలోకమున గల దేశములన్నియు చూచివచ్చి రాజున కిట్లు చెప్పెను.

"రాజశేఖరా! వారణపురమను పట్టణము కలదు. దానిని పాలించుచున్న వారణేశ్వరునకు సంతానము కలుగనందున మిగుల విచారము చెంది ధర్మకార్యములు చేయుచుండెను. కొన్ని దినములకు ఈశ్వరానుగ్రహం వలన అతనికొక కూతురు పుట్టెను. ఆమెకు సద్గుణవతియను పేరుపెట్టి అల్లారుముద్దుగ పెంచుచు సకల విద్యలు నేర్పించుచుండెను. ఆమెను ఏడంతస్థుల మేడపై భద్రముగా ఉంచెను.

వారణేశ్వరుడు ఒకనాడు వేటకుపోయి తిరిగి వచ్చునపుడు ఒకచోట సరస్సులో స్నానం చేయుచున్న ఋషిపత్నిని చూచెను. ఆమె అందచందములకు ముగ్ధుడై తనను చేరరమ్మని బలవంతం చేసెను. అతని దుష్ప్రవర్తనకు ఆ పతివ్రత కోపించి "ఓరీ, పట్టపగలు నా పాతివ్రత్యమును చెరుపదలచిన నీవును, నీ పురమును పగటివేళ నిర్జీవమైపోవుగాక" అని శపించెను. ఆమె శాపం ననుస

రించి వారణపురం పగలంతయు ప్రేతరూపం చెంది, రాత్రివేళ బ్రతికియుండును. ప్రొద్దు పొడిచిన వెంటనే అందరు నిర్జీవులగుదురు.



సద్గుణవతిని రాక్షసుడు ఎత్తుకొని పోవుట

సద్గుణవతి ప్రతిదినం రాత్రి కాగానే లేచి స్నానంచేసి వెలగల వస్త్ర భూషణము లలంకరించుకొని తిరుగుచుండును. ఒకనాడా సుందరి పైఅంతస్తుపై విహరించుచుండెను. ఆ సమయమున నొక రాక్షసుడు అంతరిక్షమార్గమున పోవుచు క్రిందికి చూడగా మేడపై తిరుగుచున్న సద్గుణవతి కనబడెను. ఆమె

అందచందాలను చూచి ఆ రాక్షసుడు ముగ్ధుడయ్యెను. ఆమెను తీసుకొనిపోయి వివాహమాడుటకు నిశ్చయించుకొనెను. వెంటనే ఆ మేడపై దిగి ఆమెను ఎత్తుకొనిపోయి, లోగడ తాను అపహరించుకొనిపోయిన స్త్రీలున్న చోటుకు తీసుకొని పోయి ఉంచెను. తన అభిప్రాయం సద్గుణవతికి చెప్పెను. ఆమె అతనిమాటలు విని గజగజ వణకిపోయినది. తుదకెట్లో ధైర్యం తెచ్చుకొని "రాక్షసేంద్రా! మీరెపుడు నన్ను తెచ్చుకొంటిరో అపుడే నేను మీ యధీనమైతిని. మిమ్ము కాదని నే నెవరిని వరింతును? మీకు నేనేగతి, నాకు మీరేగతి. మీతో కాపురం చేయుచు సౌఖ్యపడదలచుచుండుటచే మీ మేలుకై నేనొక వ్రతం చేయ సంకల్పించితిని. దానిని ఆత్మవ్రతమందురు. అది నా పుట్టింటనే ప్రారంభించితిని. ఇక మూడు మాసములు గడచిన తరువాత మీ యిష్టానుసారం వివాహమాడి సుఖింతము" అని చెప్పగా రాక్షసు డందుకు అంగీకరించి ఆమె నంటక ముట్టక ఒక గదిలోనుంచి జాగ్రత్తగా చూచుచుండెను.

ఇచ్చట వారణపురమున రాజదంపతులు సద్గుణవతి జాడతెలియనందున తీరని దుఃఖం పొందిరి. రాత్రి యంతయు నిద్రాహారములు మాని ఆమెనుగూర్చి విచారించుచు ఉదయం కాగానే మరణించుచున్నారు" అని చెప్పెను.

భేతాళుని మాటలు విని విక్రమాదిత్యుడు ఆశ్చర్యపడి, భట్టికి రాజ్యపాలనా భారం అప్పగించి, ఖడ్గభూషణాదులు చేబట్టి భేతాళునిపైనెక్కి వారణపురమునకు పోయెను. అచ్చట నొక ప్రాణియైనను మసలుటలేదు. అందరును విగతజీవులై పడియుండిరి. ఆ పట్టణ స్థితిని చూచి విక్రమాదిత్యుడు జాలిపడి, వారిని కాపాడదలచి, ఒక తటాకమున స్నానంచేసి, నిత్యకృత్యములు తీర్చుకొని

చిత్రాసనమున కూర్చుండి తన ఇష్టదేవతయగు మహంకాళిని ప్రార్థించెను. దేవి ప్రత్యక్షమయ్యెను. వెంటనే రాజు సాష్టాంగ నమస్కారములు చేసి "తల్లి! నా కెట్టి కొరతయులేదు. కాని ఈ పట్టణ స్థితి చూచిన తీరని దుఃఖం కలుగుచున్నది. రాజు చేసిన తప్పుకు సకలజీవులు కష్టములపాలైనవి. వీరిని కాపాడుటకేదయిన మార్గం చూపుము" అని కోరెను.

మహంకాళి అతని కోరికవిని సంతోషించి "వత్సా! ఈ పట్టణమును పరిపాలించుచుండిన రాజు మహా దుర్మార్గుడు. ఋషిపత్నియైనను సందేహించక ఆమె పాతివ్రత్యమును చెరుప ప్రయత్నించెను. అందువలన నీ పట్టణమునకు యిట్టి శాపం లభించినది. కనుక నీవా పతివ్రత యనుగ్రహం పొంది ఆమెచేతనే వీరినందరిని బ్రతికించుకొనవచ్చును. కాని అన్యథాచేయుటవలన ప్రయోజనంలేదు" అని చెప్పి తీర్థవిభూతులను, ఒక బెత్తమును యిచ్చి ఆశీర్వదించి అదృశ్య మయ్యెను.

తరువాత విక్రమాదిత్యుడు నూరేండ్లు నిండిన పేదబ్రాహ్మణ రూపం దాల్చి ఆ ఋషిపత్నియున్న వనమునకు దగ్గరగ భేతాళుని సహాయమున చితి నేర్పాటుచేసికొని ఆ గుండముచుట్టూ తిరుగుచు 'హర! హర! మహాదేవ శంభో!' అని అరచుచు నొక అడుగుపెట్టెను. మరిఒక అడుగుపెట్టుట కొక గడియసేపు పట్టుచుండెను. ఇట్లు నెమ్మదిగా ముందుకు నడచుచు అగ్నిగుండంలో నిజంగ పడునట్లు నటించుచుండెను. ఆ సమయంన ఋషిపత్ని ఆ మార్గమున వచుచ్చుచు ఆ శతవృద్ధునిచూచి దగ్గరకువెళ్ళి "అయ్యా! మేరీ అగ్నిగుండం వద్ద ఏమి చేయు చున్నారు? మీ పేరేమి? ఊరేది?" అని అడిగెను.



చితిలో పడబోవుటకు ప్రయత్నించుచున్న వృద్ధ బ్రాహ్మణునితో మాట్లాడుచున్న ఋషిపత్ని

ఆమె మాటలు విని ఆ వృద్ధబ్రాహ్మణుడు "తల్లీ! నేను మహాపాపిని. నాతో సంభాషించుటవలన మీకు కూడ పాపమంటగలదు. నన్ను అడ్డుకొనవద్దు. ఈ గుండములోపడి చావనిమ్ము" అని అగ్నిలోపడబోయెను.

అపుడా ఋషిపత్ని వృద్ధుని ఆపి, "నావలన మీకు కావలసిన సహాయ మేదైన నున్నచో తెలుపుడు. నాశక్త్యానుసారం మీకు ఉపకారంచేయుదును. ఏమి చేయగోరుదురో చెప్పు"డని అడిగెను.

అప్పుడా వృద్ధ బ్రాహ్మణుడు "తల్లీ! నాపేరు కంకుభట్టు. నేనుండు చోటు సరస్వతీ పట్టణం. నేను సకలశాస్త్రముల నభ్యసించి వేలకొలది శిష్యులకు నానేర్చిన విద్యలన్నిటిని బోధించితిని. అనేక రాజసభలచే సన్మానింపబడితిని. ఈశ్వరానుగ్రహమున నొకపుత్రుని బడసితిని. వానికి సకల విద్యలు నేర్పించి సాటిలేని పండితునిగా చేసితిని. యుక్తవయస్కుడైనంతట వారణపుర వాస్తవ్యుడగు వేదశాస్త్రభట్టు కుమార్తెయగు గీతను వివాహం చేసితిని. ఇవియన్నియు రాత్రిసమయమున జరిగినవి. కొంతకాలం అత్తవారింట బాగుగనే గడచినది. ఒకసారి మాయూరికివచ్చి తిరిగి అత్తవారింటికి వెళ్ళినాడు. అదేమి మాయయోకాని వాడు వెళ్ళిన తరువాత ఆ గ్రామంలోనివారు పగలు నిర్జీవులుగను, రాత్రులందు సజీవులుగను ఉండి చచ్చి బ్రతుకుచున్నారు, బ్రతికి చచ్చుచున్నారు. మా పుత్రుడు కూడ అచ్చటనే ఉండిపోయినాడు. ఎన్నిదినములైనను నాకుమారుడు తిరిగి యింటికి రానందున వారి యోగక్షేమములరయుటకై నేను వచ్చి చూడగా పట్టణ పరిస్థితి యిట్లున్నది. ఇట్లున్న కారణమేమని యడుగగా నా వియ్యంకుడు, వారి బంధుమిత్రులు, ఇరుగుపొరుగులు "మీ కుమారుడు ఈ పట్టణంలో అడుగుపెట్టిన నాటి నుండి మాకిట్టికష్టం దాపురించినది." అని నిందించసాగిరి. ఆయపవాదు భరించలేక నా కుమారుడు కాళికాలయమున కేగి గొంతుకోసుకొని చచ్చెను. మగనిపై గల ప్రేమచే నాకోడలు అగ్నిగుండమున నురికిచచ్చినది. కూతురు మరణించుట చూచి దుఃఖం పట్టలేక తల్లిదండ్రులు మరణించిరి. ఇందరు పోయిన తరువాత నేనొక్కడను బ్రతికియుండి లాభమేమి అనుకొని ఆత్మహత్య చేసికొనుటకు ప్రయత్నించుచున్నాను. నేడో రేపో చావనున్న నాకు ఇంకను బ్రతకవలెనను ఆశయుండి లాభమేమి?" అని దుఃఖపడసాగెను.

ఋషిపత్ని ఆ వృద్ధుని మాటలువిని జాలిపడి "బ్రాహ్మణోత్తమా! ఈ యూరిరాజు నన్ను మోహించి నాపాతివ్రత్యమును పాడుచేయ తలపెట్టగా, పట్టరాని కోపంపొంది నేను శాపమిచ్చితిని. ఆ శాపం కారణముననే ఈ పట్టణమున కిట్టిదుస్థితి కలిగినది. ఇకపై నీయూరెప్పటివలె కాగలదు. ఇందలి ప్రజలందరు సుఖముగా ఉండగలరు. నీకుటుంబంలోని వారెల్లరు క్షేమముగా ఉండగలరు. నీవీ అగ్నిగుండమున పడవలసిన పనిలేదు" అని పలికి, తన గృహమునకేగెను. వారణపురము ఎప్పటివలె కలకలలాడసాగెను. ప్రజలందరు ఆనందముగా ఉండిరి.

పిమ్మట విక్రమాదిత్యుడు వారణపురమునకు వచ్చి అది పూర్వపు స్థితిలో నుండుటనుగాంచి సంతోషించెను. తరువాత రాజదంపతులను దర్శించదలచి అంతఃపురంనకు పోగా వారు తమ ఏకైకపుత్రిక ఏమైనదో తెలియక దుఃఖసాగరమున మునిగియుండిరి. వారిస్థితి చూచి విక్రమాదిత్యుడు జాలిపడి, ఆమె జాడనెట్లయిన తెలిసికొని, తీసుకొనివచ్చి వారి దుఃఖము మాన్పవలెనని నిశ్చయించుకొనెను.

విక్రమాదిత్యుడు వారికి ధైర్యము చెప్పి అచ్చటి నుండి కాళికాలయమునకు పోయి ప్రార్థింపగా, మహాంకాళి ప్రత్యక్షమై ఆమెనొక రాక్షసుడు ఎత్తుకొనిపోయినాడని తెల్పి, అతడుండుచోటు నెరిగించెను. వెంటనే విక్రమాదిత్యుడు భేతాళునిపై నెక్కి సద్గుణవతి నెత్తుకొనిపోయిన రాక్షసుడు నివసించుచున్నగుహకు పోయి లోపలనున్న సద్గుణవతిని చూచి "సుందరీ! నీవీగుహలో ఒంటరిగా ఉండుటకు కారణమేమి?" అని అడిగెను. ఆమె విక్రమాదిత్యుని చూచి జరిగిన విషయ

మంతయు చెప్పి కన్నీరు మున్నీరుగా నేడ్చెను. విక్రమాదిత్యుడామె దుఃఖమును పోగొట్టి "నీవు దుఃఖపడవద్దు. ధైర్యంగా ఉండుము. నీ తల్లిదండ్రులు క్షేమము గానే ఉన్నారు. వారివద్దకు నిన్ను తీసుకొనిపోయి అప్పగింతును. మీ పట్టణంనకు కలిగిన శాపమును తీర్చినపిమ్మట నిన్ను కాపాడుటకై యిచ్చటికి వచ్చితిని" అని చెప్పుచుండగా, సద్గుణవతి "అయ్యో! ఆహారమునకై పోయిన రాక్షసుడు తిరిగి వచ్చు వేళ అయినది. అతడు వచ్చిన మిమ్ము చంపును. కావున వాడు రాకముందే నన్ను మాయూరికి తీసుకొనిపొండు" అని కోరెను.

ఆ మాటలువిని విక్రమాదిత్యుడు "ఓ సద్గుణవతీ! దొంగతనముగా తీసుకొనిపోవుట రాజధర్మము కాదు ఆ రాక్షసునిచంపి నిన్ను తీసుకొనిపోవుట న్యాయము" అనగా, "మహారాజా! ఆ రాక్షసుడు దేవతలనుండి చావులేని వరములు పొందినవాడు. వానిని మీరెట్లు చంపగలరు?" అని అడిగెను. ఆ మాటలువిని విక్ర మాదిత్యుడు "సుందరీ! నేను ఒక ఉపాయం చెప్పెదను. అట్లు చేయుము. నేడు వానితో సంతోషంగా మాటలాడుము. మాటల సందర్భంలో వాని ఆయువు ఎచ్చట నున్నదియో అడిగి తెలిసికొనుము. తరువాత తగుమార్గమాలోచించి వానిని చంపి నిన్ను తీసుకొనిపోయెదను." అని పలికి, అచ్చటి నుండి ఒక వనమునకు పోయి, కందమూల ఫలాదులుతిని ఆదినం గడిపెను.

మరికొంతసేపటికి రాక్షసుడు సద్గుణవతియున్న స్థలంనకు వచ్చెను. అతడు ఫలపుష్పాదులు తెచ్చి సద్గుణవతిని చూడబోగా నామె నిద్రపోవుచున్నట్లు నటించుచుండెను, రాక్షసుడామె దగ్గరకుపోయి లేపబోయెను. వెంటనే ఆమె పైకి లేచి యొకమూల నిలబడి విచారముతో ఉన్నట్లుండెను. రాక్షసుడామె వైఖరి చూచి

"సుందరీ! నీవేదో విచారముతో ఉన్నట్లున్నావు. నేను లేని సమయమున నీకేదైన ఆపద కలిగినదా? నీవు ఇంతకాలం నాతో సంతోషంగా మాట్లాడుచుండెడిదానవు. నేడిట్లుండుటకు కారణమేమి? నాపై నీకు దయతప్పినదా? నీవ్రతం ఇంకను పూర్తి కాలేదా?" అని యడిగెను.

అంతట నాసుందరి "రాక్షసేశ్వరా! నా వ్రతం పూర్తియైనది. ఇక సంతర్పణం చేయవలసియున్నది. దానితో వ్రతం సంపూర్తియగును. అది రేపటికి తీరగలదు. పిమ్మట నీవే నేను, నేనే నీవు. మనయిద్దరికి భేదం లేదు. కాని నన్నొక సందేహం పట్టిపీడించుచున్నది. నీవు పగలెల్ల సంచారం చేయుచుందువు. అట్టి సమయమున, రాక్షసుడవగు నీకేదైన ఆపద కలుగవచ్చును. మీకేదైన ఆపద కలిగిన అపుడు నాకు దిక్కెవరు? ఈ సందేహం నన్ను బాధించుచున్నది. మీకేదైన ఆపద కలిగిన మిమ్ము కాపాడుకొను మార్గము తెలుపుడు" అని కోరెను.

సద్గుణవతి మాటలువిని రాక్షసుడు వికవిక నవ్వి "పిచ్చిదానా! నాకు ఆపద కలుగునని భయపడుచున్నావా? నన్ను చంపగలవాడు మూడు లోకములలో నెవడునూ లేడు. నీకు నాజీవిత రహస్యమును చెప్పుచున్నాను శ్రద్ధగా వినుము. మల్లికార్జునమను నొక పర్వతం కలదు. ఆపర్వతం క్రింద వినాయకుని గుడి యొకటి ఉన్నది. అతనిని త్రోసికొని ఆవలికి పోయినయెడల ఈశాన్యగుహాయను నొక బిలద్వారం కలదు. ఆ బిలద్వారమున కూర్మవతియను నొకతాబేలు ఉన్నది. ఆ తాబేలు కడుపులో నొకపురుగు ఉన్నది. ఆ పురుగుతలలో నాప్రాణం కలదు. ఆ పురుగుతలను కోసి నాముందు వేసినయెడల మాత్రమే నా ప్రాణం పోవును.

అంతవరకు నాకు ఎట్టికీడు కలుగదు. నాచే ఇతరులెవరైన చంపబడుదురుగాని నేనెవరిచేతను చంపబడను. కావున నిర్భయంగా వుండుము. ఈ రహస్యమెవరికినీ తెలియనీయకుము" అని చెప్పెను. సద్గుణవతి అతని మాటలువిని సంతోషించినట్లు నటించెను. తరువాత వాడు ఆమెకు ఫలపుష్పములనిచ్చి రేపు కలియుదునని చెప్పి పోయెను.

తెల్లవారగనే రాక్షసుడు ఆహారంకొరకు బయటికి పోయెను. రాక్షసుడు బయటికి పోయిన విషయం గమనించి విక్రమాదిత్యుడు సద్గుణవతి వద్దకు వచ్చి రాక్షసుడు చెప్పిన సంగతులన్నియు తెలిసికొనెను. వెంటనే మల్లికార్జున పర్వతం వద్దకుపోయి, తన ఇష్టదేవతయగు మహంకాళిని స్మరించి పాతాళమునకు దిగెను. అచ్చటనున్న జొనలోదిగి నాలుగుప్రక్కల తిరిగిచూడగా వినాయకుని గుడి కన బడెను. గుడిలోని కేగి విఘ్నేశ్వరుని ప్రార్థించి తాను వచ్చిన పనిని తెలియ జేసెను.

విక్రమాదిత్యుడు దుష్టనిగ్రహ శిష్టపరిపాలనమునకై వచ్చిన వ్యక్తి యని వినాయకుడు తెలిసికొని త్రోవయిచ్చెను. ఆత్రోవను నడచిపోగా బిలద్వారం కనబడెను. బిలద్వారం గుండా లోనికిపోయి చూడగా కొండవలెనున్న ఒక తాబేలు కనబడినది. అది అచట పడియుండుటను చూచి విక్రమార్కుడు తన ఖడ్గముతో బలంగా నొకవ్రేటువేసి దాని కడుపుచీల్చి పరిశీలింపగా అందొక పురుగు కన బడెను. విక్రమార్కుడా పురుగునుపట్టి భద్రముగా నొక బరిణెయందుంచి రాక్షసుడు నివసించుచున్న గుహవద్దకు వచ్చెను. వాని ఎదుటకుపోయి ఆ పురుగుతలను కోసి వాని ముందువేయగనే వాడు మొదలునరికిన మ్రానువలె క్రిందపడి గిలగిల కొట్టు కొని ప్రాణం విడిచెను.

పిమ్మట విక్రమాదిత్యుడు సద్గుణవతి యొద్దకుపోయి, జరిగిన విషయం అన్నియు చెప్పి, "రాక్షసుని చంపివేసితిని. ఇక మనం మీపట్టణంనకు నిరాటంకముగా పోవచ్చును, రమ్ము" అని చెప్పెను.



విక్రమాదిత్యుడు పురుగును పట్టి తెచ్చి ఖండించి రాక్షసుని చంపుట



ఆ మాటలు విని సద్గుణవతి పట్టరాని సంతోషంపొంది విక్రమార్కుని ధైర్యసాహసముల ననేక విధముల కొనియాడెను. పిమ్మట ఫలహారమొసగి, కొంతతడవు విశ్రమింపజేసెను. తరువాత భేతాళుని సహాయమున వారణపురం చేరిరి.

విక్రమాదిత్యుడు వెంటనే రాజదంపతులకు సద్గుణవతిని అప్పగించి జరిగిన సంగతులన్నియు చెప్పి సంతోషపరచెను. రాజదంపతులు విక్రమార్కుని అనేక విధముల కొనియాడి, మహారాజోచితమర్యాదలు జరిపి సాగనంపిరి.

* బాలలూ! ఈవిధంగా విక్రమాదిత్యుని సాహసౌదార్య శౌర్యపరాక్రమములను తెలుపు కథలు అనేకం కలవు. అందు బాలలకు ఉపయుక్తమైన కథలు మాత్రమే యిందు వ్రాయబడినవి. మిగిలిన కథలు మీరు పెద్దవారైన పిమ్మట చదివి ఆనందించుడు. అవి మీరిప్పుడు చదువదగినవి కాదని వ్రాయలేదు. గమనించుడు. -రచయిత.

# శాలివాహనుని జననము

పూర్వము కావేరినది ఒడ్డున భల్లాణపురమను నొక పట్టణముండెను. ఆ పట్టణమునగల అగ్రహారములో రామావధాని యను బ్రాహ్మణు డుండెను. అతడు వేదవేదాంగములను, చతుష్షష్టి కళలను చక్కగా అభ్యసించెను. అతడు చింతామణి యను కన్యను వివాహమాడెను.

చింతామణి ఋతుమతియైన నక్షత్రమునుబట్టి ఆమెకు పండ్రెండేళ్ళునిండిన తరువాత మేషమాసము పదునైదవ తేది శుక్రవారము రాత్రి పండ్రెండు గడియల మీద రోహిణి నక్షత్రమున నతడే పడుచుతో చేరినను వెంటనే ఒక పుత్రుడు పుట్టునని, అతడు దేవతలను సైతము జయించి భూలోకమంతయు నేక చ్ఛత్రాధిపతియై నూరేండ్లు పాలించగలడని తెలుసుకొనెను.



ఆ సంగతి తెలుసుకొన్న రామావధాని ఆ దినము వచ్చు వరకు భార్య నంటకూడదని నిశ్చయించుకొని కాశీ మున్నగు దివ్య క్షేత్రములను దర్శించుచు గంగ మున్నగు పవిత్ర నదులలో స్నాన సంధ్యాదులు జరుపుచు కాలము గడపెను.

ముహూర్తదినము రాగానే యింటికి చేరవలెనని తిరుగు ప్రయాణం అయ్యెను. తన యూరికి రెండు ఆమడల దూరముననున్న నల్లూరు అను గ్రామమున నుండి భోజనాదులు పూర్తిచేసుకొని, అచ్చటినుండి బయలుదేరి ప్రొద్దు

పోవు సరికి తన పట్టణమునకు చేరి ఆ రాత్రి తన భార్యతో సుఖముగ కాలం గడపవలెనని, సుపుత్రుని బడయవలెనని తలచి ఆమడదూరమున నడచెను.

అప్పుడా ప్రాంతమున వర్షములు అధికముగ కురియుట వలన కావేరి నదిలో నీరు పొంగి ప్రవహించుచుండెను. నదికి ఆవలి ఒడ్డున భల్లాణపుర ముండెను. ఇవతలి ఒడ్డునుండి అవతలి ఒడ్డుకు చేరగలిగిన స్వగృహం చేరి నట్లే. కాని ప్రవాహం క్రమక్రమంగా అధికమగుచుండుటవలన రామావధాని నదిని దాటి పోవుటకు ఏ మాత్రం అవకాశం లేకుండెను. అందువలన నతడు "అయ్యో! ఎంతోకాలంనుండి ఎదురు చూచుచున్న దినం వచ్చినది. కాని ఇంటికి పోయి నా భార్యను కలియు నవకాశం కలుగకున్నది. నేను పెట్టుకొన్న ఆశ లన్నియు నిరాశలైనవి. నాకు సుపుత్రుడు కలుగు అదృష్టం తప్పిపోయినది. నా పుత్రుడు మహావీరుడు కాగలడని, అనేకమంది రాజులను జయించి చక్రవర్తి యగునని, వానివలన నా జన్మ చరితార్థం కాగలదని నమ్మియుంటిని. "తానొకటి తలిస్తే దైవమొకటి తలచె"నన్నట్లయినది. అని పరి పరి విధముల చింతించుచు, నది యొడ్డున కూర్చుండి తల కొట్టుకొనుచుండెను.

అపుడానది యొడ్డుకు ఒక కుమ్మరివాడు వచ్చెను. అతనిపేరు వేలార్. భార్యపేరు లక్ష్మి. అతని నివాసస్థలము ఆ నదియొడ్డున నున్న వేదగిరి. అతనికి ఒక కూతురుండెను. ఆమె పేరు అన్నపూర్ణ. ఆమె సాటిలేని సౌందర్యవతియై అలరారుచున్నది.

వేలార్ తన కుమార్తెకు ఏడేండ్లున్నప్పుడే కొడగు దేశమున నున్న ఒక కుమ్మరి యువకునకు యిచ్చి పెండ్లి చేసినాడు. అతడా బాలిక రజస్వలయైన పిమ్మట తన యింటికి తీసుకొనిపోవచ్చుననుకొని తన స్వగ్రామమునకు పోయెను.

అట్లుండ ఆరుమాసములక్రిందట అన్నపూర్ణ రజస్వలయైనది. మరల ఋతుమతియై అయిదవ దినం స్నానంచేసి ఆనాడే ఇంటిలోనికి పోయినది.

ఇట్లున్న సమయమున వేలార్ మట్టి తెచ్చుకొనుటకై నది ఒడ్డుకు పోయెను. అదే సమయమున రామావధాని నదిని దాటి తన యూరికి పోవుటకు వీలులేకపోయినందున నది ఒడ్డున కూర్చుండి తల కొట్టుకొనుచుండెను. వేలార్ అతనిని చూచి జాలిపడి "అయ్యా! తమరుచూడగా గొప్ప పండితులవలెనున్నారు. మీరిచ్చట కూర్చుండి విచారపడుటకు కారణమేమి? మీకు కలిగిన కష్టమేట్టిదో తెల్పుడు. చేతనైన సహాయం చేయుదును" అని అడిగెను.

వేలార్ మాటలు విని రామావధాని "ఓయీ! నేనీ నదికి అవతలి గట్టుననున్న భల్లాణపురాగ్రహారమున నివసించు బ్రాహ్మణుడను. నా పేరు రామావధాని. నాకు వివాహం అయినది. నా భార్య ఋతుమతియై లగ్నఫలము పన్నెండేండ్లు నిదానించిన తరువాత ఆమెను కూడినతరువాత నా వదుచుగర్భమున జన్మించు కుమారుడు భూలోకమంతను ఏకచ్ఛత్రాదిపతియై పరిపాలించునట్లున్నది. ఆ లగ్నముననే చేరిన మేలు. ముందుగ చేరి సంసారంచేసి పనికిమాలిన బిడ్డలను పలువురను పొందనేలయని తలచి తీర్థయాత్రలకు పోయితిని. పన్నెండు సంవత్సరములు దేశాటన చేసితిని. నేను తిరగని స్థలములులేవు. చూడని వింతలు లేవు. నేటితో ఆ పన్నెండేళ్ళ గడువు ముగియుచున్నది. ఆ లగ్నము నేటిరాత్రి పన్నెండు గడియలకు వచ్చుచున్నది. లగ్నసమయమునకు ఇంటికి చేరదలచి ఎంతో సంతోషముగా వచ్చిన నాకు నది అడ్డమైనది. ఇంటికి పోవుటకు మార్గము లేక తల కొట్టుకొని ఏడ్చుచున్నాను" అని చెప్పెను.

రామావధాని చెప్పిన మాటలు విని వేలార్ చాల బాధపడినాడు. ఏదో ఒక విధముగా ఆయన కోరిక దీర్చునట్లు తోడ్పడవలెననుకొన్నాడు. రామావ

ధానిని చూచి, "భూదేవా! ఈ ప్రవాహమింతలో తగ్గునట్లులేదు. నేడు మీ పట్టణం చేరుట కేమాత్రము అవకాశం లేదు. రేపు ఎట్లయినను పోవచ్చునుకాని మీ చిర కాల కోరిక దీర్చుకొనుటకు తగు మార్గమెదయినా ఆలోచింపుడు. ఎంత ఆలో చించి ఏమి లాభం? తగినంత వ్యవధి లేదుకదా? లోకోత్తరమైన దేవరవారిలగ్నం వ్యర్థము కాకుండ నేనొక ఉపాయం చెప్పెదను వినుడు. నాకొక కుమార్తెకలదు. అది అప్సరసలను ధిక్కరించునట్టి అందచందములు కలిగి అలరారుచున్నది. దాని పేరు అన్నపూర్ణ. అది ఋతుమతియై యిప్పటి కారు మాసములైనది. ఆమె బహిష్టై నేటికైదు దినములైనది. నదికి వచ్చి స్నానము చేసి ఇప్పుడే యింటికి పోయినది. కనుక మీ సంకల్పము వృధా కానివ్వక, నేటిరాత్రి మా ఇంటికి వచ్చి నా పుత్రిక కడ కరుదెంచి మీ యిష్టానుసారము చేయు"దని చెప్పెను.

అతని మాటలు విని రామావధాని కొంతసేపు ఆలోచించి, లగ్న ఫలం వృధా కానిచ్చుటకంటె వేలార్ చెప్పినట్లు చేయుటయే మంచిదని నిశ్చయించు కొనెను. తరువాత అతని యింటికిపోయి ఆతిధ్యం స్వీకరించి, మిక్కిలి ఆనం దించి ఆరాత్రి అన్నపూర్ణతో గడపెను. తెల్లవారగానే వేలార్ వద్ద శలవు తీసు కొని స్వగృహమునకు పోయెను.

అటుపిమ్మట అన్నపూర్ణ గర్భందాల్చి తొమ్మిదినెలలు గడచిన తరు వాత శుభసమయమున కోటి సూర్యప్రకాశమానుండగు నొక కుమారుని కనెను. ఆ బాలుడు శుక్లపక్ష చంద్రునివలె దినదినాభివృద్ధి పొంది శాలివాహనుడను పేర పిలువబడుచుండెను. క్రమముగా ఆ బాలుడు అయిదేండ్లవాడైనంతట ఒక శుభ ముహూర్తమున అక్షరాభ్యాసం చేయించిరి. అతడు ఏడుసంవత్సరములలో సకల కళా విశారదుడై గురువును మించిన శిష్యుడనిపించుకొనెను. తాతగారు కుండలు

చేయునపుడు శాలివాహను డాతని దగ్గర కూర్చుండి మట్టితో ఏనుగులు, గుఱ్ఱములు, రథములు, మనుష్యుల బొమ్మలు తయారుచేసి ఇంటిలో దాచుచుండెను.

శాలివాహనుడు క్రమంగా పండ్రెండేండ్లవాడయ్యెను. అప్పుడు వారు నివసించుచున్న మహిషాపురపు రాజు విశ్వనాథుడనువాడు విక్రమాదిత్యునకు కప్పము కట్టుచు, సామంతప్రభువై ఉండెను.

శాలివాహనుడు ఆ రాజువద్దకుపోయి అతనివద్ద రెండవ మంత్రి పదవి పొందెను. అతడు రాజకార్యములలో మంచి సలహాలిచ్చుచు రాజునకెంతో మేలు కలుగజేయుచుండెను. శాలివాహనుడు చిన్నవాడైనను రాజు అతని మాటల నలక్ష్యం చేయక ఎంతో గౌరవముగా చూచుచుండెను.

ఇట్లు జరుగుతుండగా విశ్వనాథుడు విక్రమాదిత్యునకు కప్పము చెల్లించు సమయం వచ్చెను. ఆ సమయమున ఆ రాజువద్ద అంత ధనము లేకుండెను. విశ్వనాథునకు ఏమి చేయవలెనో తోచక శాలివాహనుని చూచి "అమాత్యా! మనం విక్రమాదిత్యునకు కప్పము కట్టవలసియున్నది. మనవద్ద అంత ధనములేదు. ఒక దిన మించుమించైన ప్రమాదం తప్పదు. వారు వచ్చి నన్ను రాజ్యంనుండి తరిమి వేయుదురు. ఈ యాపదనుండి బయటపడు నుపాయ మాలోచింపుము" అని చెప్పెను.

రాజు మాటలు విని శాలివాహనుడు "రాజా! మీరు ధైర్యముగా ఉండుడు. రాజునకు కప్పం కట్టవలసిన అవసరమేమున్నది? ఈ భూమిని విక్రమాదిత్యుడు స్వంతంగా తయారుచేసినాడా? అతని తాత, తండ్రులు సంపాదించినది కాదుగదా! భూమండలం భగవంతుని సొమ్ము. దానిపై ఎల్లరకు అధికారంకలదు. అతనికి భయపడ కప్పం కట్టవలసిన అవసరంలేదు. ఇకముందు మేము కప్పం కట్టమని కబురు పంపుడు. ఒకవేళ మనపై యుద్ధమునకు వచ్చిన రానిండు.

నేనతని నోడించి, నిమిషకాలంలో అతనిని యమపురికి పంపి, సర్వస్వమును వశ పరచుకొని ఏకచ్ఛత్రాధిపతిని కాకున్న నేను శాలివాహనుడనే కాను" అని శపథం చేసెను. ఆ మాటలు విని రాజు మొదలగు వారందరు మారుచెప్పలేక మౌనంగా ఉండిపోయిరి.

ఇట్లుండ విక్రమాదిత్యునకు అందరు రాజులు కప్పం చెల్లించినట్లును, విశ్వనాధుడు మాత్రం కట్టలేదని తెలిసినది. అతడందుకు కోపించి, అధికారులను పిలిపించి "మీరు వెళ్ళి విశ్వనాధుని వద్ద కప్పం వసూలుచేసి తెండని" ఆజ్ఞాపించి పంపెను.

విక్రమాదిత్యుని దూతలు వెంటనే మహిషాపురికి వచ్చి రాజును కలిసి కప్పం కట్టమని అడిగిరి. రాజు ఏమియు జవాబు చెప్పలేదు. శాలివాహనుడు ఆ దూతలను పిలిచి "దూతలారా! మీరు మీ రాజువద్దకు పోయి "విశ్వనాధరాజుగారి ద్వితీయ మంత్రియగు శాలివాహనుడు మీకీ సమాచార మంపెనని చెప్పి యిట్లు తెల్పుడు. రాజసమానులగు రాజులనుండి కప్పం వసూలు చేయుట అన్యాయం. అట్లు తీసుకొనుట బందిపోటుదొంగల ఆచారమగును కాని రాజులు చేయవలసిన పనికాదు. కావున ఇకముందు కప్పం మాట యెత్తవద్దని చెప్పుడు. ఒకవేళ కప్పం అవసరమైన నా ఖడ్గధారను కప్పమున్నది. వచ్చి దీసుకొనమని చెప్పుడు" అని పలికెను.

వెంటనే దూతలు విక్రమాదిత్యుని కొలువునకు వెళ్ళి శాలివాహనుడు చెప్పిన మాటలనన్నిటిని చెప్పిరి. ఆ మాటలు విన్న విక్రమాదిత్యునికి పట్ట శక్యం కానంత కోపం వచ్చెను. భట్టిని చూచి "అమాత్య శేఖరా! మనం రాజ్య మునకు వచ్చినది మొదలు యింతవరకు మనమాట కెదురు చెప్పినవారు లేరు. ఎవడో శాలివాహనుడట! పట్టుమని పాతికేండ్లయినను లేనివాడట. ఎంత పొగరుగ

సమాధాన మిచ్చి పంపినాడో వింటివిగదా! ఇట్టి ధిక్కారమును సహించి ఉండ గలమా? మన శక్తిసామర్థ్యములు తెలియని పిల్లవాడేదో అన్నాడని ఊరుకొన్న సాటి రాజులలో లోకువై పోవుదము. వెంటనే దండెత్తివెళ్ళి వాని పొగరణచ వలెను. రేపే బయలుదేరి పోవుదము. సైన్యములను సిద్ధంగా ఉంచుడు" అని ఆజ్ఞాపించెను.



సైన్య సమేతముగ యుద్ధమునకు వచ్చిన విక్రమాదిత్యుడు మహిషాపురము చుట్టును ఉన్న బొమ్మల సైనిక బలములను చూచి ఆశ్చర్యపడుట

మరునాడు భట్టి-విక్రమార్కులు చతురంగ బలములతో బయలుదేరి మహిషాపురమునకు బోయిరి. భట్టి-విక్రమాదిత్యులు సమస్త దివ్యాయుధములను ధరించి, ఆడంబరముగా పోయి మహిషాపురం చేరిరి. కోటకు కొంతదూరమున గుడారములు వేసుకొనియుండిరి.

ఈలోపుగా శాలివాహనుడు మహిషాపురముననున్న సైన్యములను సిద్ధంగా ఉంచెను. తన స్వస్థలమగు వేదపురికేగి తాను మట్టితో చేసిన రథ గజ తురగ పదాతుల నన్నిటిని తెచ్చెను. వాటిని పట్టణం చుట్టు నిలిపి యుంచెను.

## శాలివాహనుడు విక్రమాదిత్యుని జయించుట

ఆ మట్టిబొమ్మలను చూచి భట్టి-విక్రమార్కులు "పట్టణంచుట్టు మట్టితో తయారుచేసిన రథములు, ఏనుగులు, గుఱ్ఱములు, సైనికుల బొమ్మలు ఉంచబడిన వేమి? చిత్రముగనున్నదే! ఈరాజుకున్న సైనిక బలములివేకాబోలు! ఈమాత్రం దానికి కప్పం కట్టనని పెద్దపెద్ద మాటలు ఎందుకు చెప్పినారో?" అనుకొనిరి.

తరువాత విక్రమాదిత్యుడు రణభేరి వేయించి దూతలను రాజు వద్దకు పంపగా విశ్వనాథుడును, అతని ప్రధానమంత్రియు భయపడి, "ఈ శాలివాహనుని మంత్రిగా చేయుటవలననే మనకిట్టి విపత్తు సంభవించినది" అనుకొనుచుండగా, శాలివాహనుడు మందహాసం చేయుచు మట్టిబొమ్మల వద్దకుపోయి మంత్రజలముల ప్రోక్షించెను. వెంటనే ఆ బొమ్మలన్నిటికి ప్రాణంవచ్చెను. ఒకటికి వేయి చొప్పున నధికమై ముందుకునడచి విక్రమాదిత్యుని సైన్యముల మీదకుపోయి క్షణములో ఆ సైన్యమునంతను సంహరించినవి. అది చూచి విక్రమాదిత్యుడు నిశ్చేష్టుడై భట్టినిచూచి "సోదరా! ఈ విచిత్రమేమి? మనకు అంత్యకాలం సమీపించినదా ఏమి?" అని అడుగగా భట్టి లెక్కచూచి "అన్నా! రేపటితో మనకు రెండు వేలేండ్ల వయస్సు పూర్తియగుచున్నది. రేపటితో మన జీవితములు ముగియు చున్నవి. ఇకపై మన శక్తియుక్తులు పనిచేయవు. మనం శాలివాహనునిచే చంప

బడకముందే యిచ్చటి నుండి వెళ్ళిపోవుట మంచిది" అని చెప్పెను.

భట్టి మాటలువిని విక్రమాదిత్యుడు బేతాళునిపిలిచి "నన్నును, భట్టిని తక్షణం ఉజ్జయిని మహాంకాళి సన్నిధికి తీసుకొనిపొమ్ము" అని ఆజ్ఞాపించెను. వెంటనే భేతాళుడు వారిని తన భుజములపై నెక్కించుకొని మహాంకాళి సన్నిధికి తీసుకొనిపోయెను.



విక్రమార్కుడు దేవిననేక విధముల స్తుతించి, భేతాళునకు పూర్వపు రూపమునొసగమని ప్రార్థించెను. వెంటనే భేతాళుడు తన పూర్వరూపమగు బ్రాహ్మణరూపంను పొంది, భట్టివిక్రమార్కుల నాశీర్వదించి, వారివద్ద శలవు తీసుకొని స్వస్థలమునకు పోయి, ఎప్పటివలె శివాలయమున పూజారిగా పనిచేయ సాగెను.



పిమ్మట విక్రమాదిత్యుడు మహాకాళికి సాష్టాంగదండప్రమాణం లాచరించి, శాలివాహనుని పుట్టుపూర్వోత్తరములను తెలిసికొని నిలబడెను. భట్టి మనం ఒకరిచే చంపబడరాదని తలచి పంచేంద్రియములను బంధించి, ప్రాణంవదలి కైలాసమున కేగెను.



అచ్చట శాలివాహనుడు విక్రమాదిత్యుని సైన్యంనంతటిని రూపుమాపి, వెదకిచూడగా భట్టి-విక్రమార్కులు కనబడలేదు. అంతటనతడు వారు ఉజ్జయినికి పోయియుందురని గ్రహించి, శత్రుశేషముంచరాదని నిశ్చయించుకొని ఉజ్జయినికి పోయి విక్రమార్కుని శిరస్సు ఖండించమని మట్టితోచేసిన చక్రం ప్రయోగించెను. ఆ చక్రమతివేగముగపోయి దేవి సన్నిధానమున నిలబడియున్న విక్రమార్కుని శిరమును ఖండించెను. భట్టి అంతకుముందే మరణించియుండుట చూచి చక్రం తన స్వస్థలమున కేగెను.

విక్రమాదిత్యుని తల అతని రాణులున్నచోట పడినది. దానిని చూచి పట్టపురాణులందరు గోడుగోడున నేడ్చి, అగ్నిగుండమ్మున పడి దేహత్యాగంచేసిరి.



శాలివాహనుడు వదలిన మట్టిచక్రము విక్రమాదిత్యుని శిరస్సు ఖండించుట
భట్టి పంచేంద్రియములను బంధించి మరణించుట

వారితోపాటు విక్రమార్కుని శిరస్సును కూడ గుండమున పడవేసిరి. భట్టి కుమారుడు తన తండ్రి మృతదేహంను, విక్రమాదిత్యుని కళేబరమును దహనం గావించెను.

పిమ్మట శాలివాహనుడు విశ్వనాధుని చూచి "రాజా! మీరు నా తండ్రి వలె ఉండవలెను. నేను ఈ రాజ్యమునకు పట్టాభిషిక్తుడనై భూమండలమంతయు ఏలవలయును" అనగా, రాజు అంగీకరించి అట్లేచేసెను. శాలివాహనుడు చిరకాలం ప్రజలను చక్కగా పాలించి శాశ్వతకీర్తినార్జించెను. ***